

# ద్రౌపదీ పరిణయము

(ఐదంకముల నాటకము)

కర్త:

కీ॥ శే॥ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు

(గయోపాఖ్యానాది గ్రంథకర్త)


చిలకమర్తి లక్ష్మీనరసింహముచేఁ

ప్రకటింపఁబడినది

1960




[ వెల 1 రూ. 75 న. పై.



# ద్రౌపదీ పరిణయము

( ఐదంకముల నాటకము )

కర్త :


కీ॥ శే॥ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు
( గయోపాఖ్యానాది గ్రంథకర్తలు )



చిలకమర్తి లక్ష్మీనరసింహము చేఁ
ప్రకటింపఁబడినది

1960




[ వెల 1 రూ. 75 న. పై.

# తొలిపలుకు



గయోపాఖ్యానాది సుప్రసిద్ధ నాటకములను, పెక్కునవలలను ప్రహసనములను రచించి యాంధ్రభాష కపూర్వ సేవ కావించిన కీ. శే. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి నామ మెఱుంగని వా రాంధ్రులలో నుండరు. వారిజీవితకాలముననేవారు రచించిన గ్రంథములు పెక్కుముద్రితములై జనాదృతిని గాంచినవి. కొన్నినాటకములనుమాత్ర మేలకో వారు యౌవనముననే రచించియుంచినను ముద్రింపటకుఁబూనుకొనరైరి. షష్టిపూర్తిసమయమున వానిని ముద్రింపవలెననుకొనిరి కాని యవియప్పుడు లభించినవికావు. తరువాత వెదకఁగా వారిగ్రంథములలో కీచకవధ, నలనాటకము, సీతాకల్యాణము, శ్రీరామజననము, ద్రౌపదీపరిణయము అను నాటకములు దొరకినవి. ఇవి యన్నియు వారిజీవితకాలమునఁబలుసార్లు ప్రదర్శింపఁబడినవే వారి స్వీయచరిత్రలో వీనినామములు పేర్కొనఁబడియున్నవి. ప్రస్తుతము ద్రౌపదీ పరిణయమును బండితులచేఁబరిష్కరింపఁజేసి ప్రచురించుచున్నాము. క్రమముగా నితరనాటకములనుగూడ ముద్రింపవలెనని యభిలాష. విద్యాశాఖవారును, బండితులును, ఆంధ్రజనులును మా యుద్యమమును ప్రోత్సహించి దివంగతులైన పంతులుగారి నాటకములన్నియు ముద్రితములగుట కవకాశము కల్పింతురుగాక యని కోరుచున్నాను.

హైదరాబాదు
10-6-60

చిలకమర్తి లక్ష్మీనరసింహం
(పంతులుగారి మనుమఁడు)

# ద్రౌపదీ పరిణయము

## నాంది



శ్రీకరుఁ డా శ్రితాంతక సురేంద్రసుతుం, దరిభీముఁ డంగనా
లోకవిలోకనాశ్వసుఁడు, లోకవిభుండు, విజాంబిక ప్రభా
సేక వినిర్జితాబ్జుఁ, డతసీకుసుమాభశరీరుఁ, డార్తర
క్షాకరణ ప్రవీణుఁడగు శౌరి మిముం దయఁ జూచు నెప్పుడున్

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సూ: ఆర్యా ! ఇటురమ్ము.

నటి: (వచ్చి) ఏమి ! ఈనాఁడేదో పుస్తకము చేతఁబట్టుకొని కూర్చు న్నారు? ఏదైన నూత్ననాటకము లభించినదా ?

సూత్ర: నీవెంతచక్కఁగా గ్రహించితివి. చదువుల సరస్వతివి గదా ! ఔను. ఒకనాటకము లభించినమాటనిజమే. అది ప్రాఁతదేకాని క్రొత్తది.

నటి: మీరన్నమాట నాకర్థమగుటలేదు. ప్రాఁతదైనను క్రొత్తదగుట యేమి ?

సూత్ర: ఇదివఱకిది పలుసార్లు రంగమునఁ బ్రదర్శితమౌటచేఁ బ్రాఁతది. ఇప్పుడే ముద్రితమగుటచేఁ గ్రొత్తది.

నటి: ఎవరు రచించినది.

సూత్ర: అంధులయ్యు ననేకాద్భుత నాటకములు రచించిన యామహ నీయుఁడు నీకు సుపరిచితుఁడే.

నటి: కీ. శే. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారా? అయినచో
మీకీనాఁడు లభించినది నాటకరత్నమే?

సూత్ర: అందుకు సందేహమేమి?
వివిధములు నాటకమ్ములు నవలలెన్నొ
రచనగావించి యాంధ్రికి రత్నభూష
లమరఁ జేసిన యాకవితాంబురాశి
ఘనత యేమనిచెప్పుదుఁగంజనేత్రి!

నటి: ఔను. ఆయనప్రతిభ సర్వాంధ్ర జనవిదితమే.

సూత్ర: నేఁటిరాత్రి యీనాటకమాడవలయునని సామాజికుల యాజ్ఞ.

నటి: మీరేమైననాడుదురు. నాకేమో ఉనసు మనసులో లేదు. అమ్మాయికి
మీ మేనల్లుఁడు తగినవరుఁడు కదాయని యింతవఱకు నూఱట
గల్గియుంటిని. ఆతఁడేదో కారణమునఁ బరదేశములకరిగెనని
వినినప్పటినుండియు నాకు మిగుల వంత జనించుచున్నది.

సూత్ర: అట్టివారి నింకను నలుగురైదుగురిని వెదకియుంచినాను. వారిలో
నెవ్వరినో యొకరిని నిశ్చయింతము.

నటి: మీరైదుగురినిఁగూడ నిశ్చయింపఁజాలుదురు.

సూత్ర: అట్లనఁబోకుము. అమ్మాయిపెండ్లి విషయమున నాకుమాత్ర
మాత్రములేదా?
తగినవరునకొసఁగి తనుజకుద్వాహమ్ము
వేగచేయు కోర్కె పేర్చుమదిని
యోగ్యుఁడైన సుతుని యువరాజుగాఁజేయ
నంధనృపతికిచ్చ యడరునట్లు.

(నిష్క్రమింతురు).

(ఇది ప్రస్తావన).

# ద్రౌపదీ పరిణయము



## ప్రథమాంకము

రంగము 1 : ధృతరాష్ట్రమందిరము. (ధృతరాష్ట్రుడును విదురుడును బ్రవేశింతురు)

ధృత : ఓయీ విదురా! దురితకుధరభిదురా!

ఉ॥ అవనిని నేలినాఁడఁగద, యంధుఁడనయ్యును బెక్కునాళ్లు, నీ
యవసరమందు రాజ్యము మహాభరమై మదిఁదోఁచుచుండె, నో
యవిరళబుద్ధి! పాండవులయందునొ నాసుతులందొ యొక్కనిన్
యువపతిఁజేతుఁ నర్హుఁడగు నున్నత చిత్తునిఁ దెల్పు మిత్తఱిన్
కావున

తే॥ గీ॥ ఎవనిఁజెప్పిన నేమౌనొ యొప్పుడంచు
సందియము లేశమైనను బొందకుండ
నీ యభిప్రాయమును జెప్పి నిఖిలమయిన
ప్రజల యభిమతమునుగూడ స్పష్టపఱుపు
వేగ మెఱిఁగింపుము.

విదు: రాజా! ఆవిషయమై ప్రకృతి జనులిట్లు చెప్పుకొను చున్నారు.

తే॥ గీ॥ ఆర్యజనహితులు నతులధైర్యమతులు
సద్గుణరతులు పాండుభూజానిసుతులు
అందు జ్యేష్ఠుండు ఘన ధర్మనందనుండు
అతఁడెయువరాజు గావలెనవని మాకు
అని—

ధృత: (సంతోషముతో) వారట్లు శ్లాఘింపఁబడుటచే నామనం బమందానం దంబునొందుచున్నది. అట్టి లోకజనమాన్య చరిత్రులకుం దల్లియై యెల్ల సుఖంబులంబొందు కుంతియు, పాండుధరాతలే శ్వరుండును దొల్బామున నొనరించిన యగణ్యపుణ్య మింతింత యని వర్ణింప నలవికాదు.

విదు: అగును, జననీ జనకులు తనయుల యధిక యశంబును నిరంత రంబును గోరుదురు. కాని కోరినమాత్రమ్మున నందఱకు నట్లది లభ్యంబుగాదు. అయ్యది లభ్యమయ్యేనేని అట్టి తలిదండ్రుల కంటె నదృష్టవంతు లెవ్వరునులేరు. ఆ కారణంబుననే కుంతి యును అనల్పతరభాగ్యవంతురాలని నుడువందగు.

ధృత: (విచారముతో) కాని-జాత్యంధుఁడనగు నాకుఁబూజ్యంబగు రాజ్య భారంబొసంగి సకల క్షత్రియపుంగవుల సంగరరంగంబున నోడించి తదీయగణనాతీత ధనంబులం దెచ్చి నాకు నివేదనం బొనర్చి భూరిదక్షిణాసమేత మహాధ్వర విధానంబులు విధివిధా నంబుగ నాచేఁ జేయించి నన్నుఁ గృతకృత్యునిఁజేసిన పాండు రాజుం దలంచిన నా హృదయము జల్లుమనుచున్నది. అయినను ఖేదమోదంబు లొక్క సమయముననందే సముత్పన్నము లగు చున్నవి.

విదు: రాజా! అది యెట్లు?

ధృత: విదురా! మామకపాదారవింద సేవనానందుండును, నిరంతరధర్మ గుణబద్ధుండును, సహోదరుండును నగు పాండురాజు వియోగ ముచేఁగలుగు ఖేదంబును, దత్కుమార సింహపంచకంబు క్రౌంచవిదారధీరతం భువనవిఖ్యాతి గాంచుటచే నుదయించెడు

మోదంబును నేకీభవించి నా హృదయమును గలవరపఱుచు చున్నవి. మహామహీరుహంబు జాతవేదభీకరశిఖాదహ్యమానం బగుచో దానియొక్క యం దనురాగంబు గలుగునట్లు పాండు నిర్యాణానంతరంబతని తనయులపై నాకధిక ప్రేమంబు గలుగు చున్నది.

విదు: రాజా! నీకట్లుండుట సహజధర్మంబు, సహోదరునకును దదీయ కుమారులకును నావంతయు భేదంబు లేదనుటకు సందియంబేమి గలదు. అదియునుగాక పాండుయశోవిశాలుండగు నప్పాండు ధరాకళత్రుండు కళత్రమాత్ర ద్వితీయుండై శతశృంగ ధరా ధరేంద్రంబున నక్షయ లోకనివాసుండగుట యాదిగా నధిక పుత్రవాత్సల్యంబుతోఁ బాండునందనులను నీవ పెనుచుటచే నీకు వారియం దతిస్నేహంబు గలిగియున్నది. నీ కుమారుల కును బాండు కుమారులకును భేదంబులేదు.

ధృత: అవును. సాయంకాలంబున ఘనతర రాజకార్య విచారణ పరిక్షి భిత మనస్కుండనై మదీయ సంతోషపయఃపారావార ప్రవృద్ధి కరంబులగు వారి మాటయేవ్వుర వదన సుధాకరబింబంబుల నుండి వెల్వడు వచనామృతంబు గ్రోలుచు పరవశుండనై యుందును. అందు యుధిష్ఠిరుండు సకల ధర్మాధర్మ విచక్షణుం డయ్యును నిగర్వచూడామణియై గురుజనంబులయెడ నధిక భక్తిగలిగి ప్రవర్తిల్లుచుండును, సమీరనందన దుర్యోధనులు గదా యుద్ధరహస్యంబు లరయుచుందురు. సంక్రందన నంద నుండు శస్త్రాస్త్ర ప్రయోగ మంత్రతంత్ర పరిజ్ఞానాసక్తుండై యలరుచుండు. నకుల సహదేవులును తక్కిన కుమారులును

గృపాణాద్యాయుధ ప్రయోగంబుల నెఱుంగుచుందురు. అట్టి కుమారమధ్యంబు నందుండి నేను దిగ్దశగణ మధ్య విభ్రాజమానుండగు కశ్యపుని చందంబునను గాంధార వసుంధరా వల్లభప్రియతనూజ యదితి చందంబునను గడు సుఖంబులొందుచుందుము.

విదు: రాజా! అది యంతయు నా యుల్లంబునఁ దెల్లంబై యున్నయది. అదియునుగాక కుమారాస్త్ర విద్యాసందర్శన కాలంబున భవత్కుమారశతప్రజ్ఞావిశేషంబులును గౌంతేయ నైపుణ్యంబులును. నేనును, గాంగేయ కుంభసంభవాదులు నెఱిఁగింతిమి. వారు భవత్కుమారులకంటె నత్యధిక బల దర్పోన్నతులు. అందగ్రజుండు యుధిష్ఠిరుండు తరుణ వయస్కుండయ్యు మహాయశోవిశాల స్ఫూర్తియుఁ గందర్ప దర్ప పరిహాసమూర్తియు వృద్ధ జనానువర్తియు నగువాఁడు. బలవంతుఁడును బుద్ధిబలోన్నతుండును ప్రజాపాలనంబు చేసిన లగ్గు. అదియునుగాక ధర్మనందనునియందు సకల ప్రకృతి మానవులకు ననురాగము మెండుగఁ గలదు. కావున నయ్యజాతశత్రుని యువరాజుగా నొనర్చుము. ఈ కార్యంబు సకల కురుకుల హితంబును, నిఖిల ప్రకృతి జన సమ్మతంబును.

ధృత: విదురా! ఏతద్విషయమై నీవింత ప్రసంగింపనేల. యుధిష్ఠిరుండు యువరాజ పట్టభద్రుండైనను, దుర్యోధనుండు యువరాజ పట్టభద్రుండైనను నాకు సమానమే. ఇది యమ్మందాకినీ నందన కుంభసంభవ ప్రముఖుల కెఱింగించి యా యుదంతం బాద్యంతంబు తేటతెల్లంబుగ నాకుఁ దెల్పుము.

విదు: అట్లేచేసి యొక ముహూర్తంబున నిచ్చటికి మరలివచ్చు వాఁడను
(నిష్క్రమించును.)

ధృత: (తనలో) మత్సహోదర పుత్రుండగు కౌంతేయాగ్రజన్ముని యువరాజుగా నొనర్చిన మత్సుతుండు దుర్యోధనుం డేమి సేయునోగదా! పుత్రస్నేహంబున నేనెట్టికార్యంబులకు లోనగుదునో! ఏమి నిందలఁ బొందుదునో? అయినదికానిమ్ము. వాఁ డన్యధా యెట్లు తలంచును?

( సంజయుఁడు ప్రవేశించును. )

సంజ: కౌరవేశ్వరా! జయమగుఁగాక, జయమగుఁగాక.

ధృత: సంజయా! ఏమి, ఎచ్చటనుండి యచ్చటకు విచ్చేసితివి. విశేషములు లేవుగదా!

సంజ: మఱియేమున్నది. మహారాజా! పాండవాగ్రజుంగూర్చి జనంబులిట్లు తమలోఁ దాము చెప్పుకొనుచున్నారు. "ప్రజారంజకుండైన ధనంజయాగ్రజుండు యువరాజైన దేశంబులకెల్ల లెస్స" అని.

ధృత: సరే. తద్విషయమై మేమిదివఱకే విదురముఖంబున వినియున్నారము. అదిగాక యింకేమి వార్తలు?

సంజ: అంతకంటె నితరములులేవని మనవి యొనర్చెద.

ధృత. (కొంచెమాగి—ఆలకించి) అదిగో, అడుగుల చప్పుడగుచున్నది. సంజయా! వారెవరో యెఱింగిరమ్ము.

సంజ: మహారాజా! దుర్యోధనకుమారుండు భవద్దర్శనలాలసుండై వచ్చియున్నాఁడు. కాని వాని వదనారవిందం బేమి కారణంబుననో విన్నవోయి యున్నది. దానిని మీరెఱుంగవలయు.

( దుర్యోధనుఁడు ప్రవేశించును )

ధృత: ఏమీ! పదనారవిందంబు విన్నవోయి యున్నదా? కుమారా! దుర్యోధనా! నాయనా! యిటువచ్చి సుఖోపవిష్టుండవుగమ్ము.

దుర్యో: (తనలో) యుధిష్ఠిర యువరాజ పట్టాభిషేక మహోత్సవభంగంబుగావించి పాండవులను ఈ హస్తినాపురంబునుండి తోల నుపాయంబును వెదకి నెరవేఁర్పఁదలంచి వచ్చినాఁడనుగదా! తత్కార్యనిర్వహణ సాధనంబులగు నాలోచనంబుల నంగరాజును, మామకమాతులుండగు శకునియు, నాకుఁ దెల్పిరి. (ప్రకాశముగా) ఇస్! అబ్బా! (అని కూర్చుండును)

ధృత: (కుమారునిఁదడవి) కుమారా! కాయము కృశించి నట్లున్నది. భవన్మనోవేదనావివర్ధకంబగు నా యవమానంబును నాకెఱిఁగింపుము. భవత్సహోదర శతంబు భవదాజ్ఞాను వర్తనమై యున్నదికదా!

దుర్యో: తండ్రీ! మామక సహోదరులు నాయెడ నవిధేయత చూపుదురా? అది స్వప్నావస్థ యందైనను నూహింపవలదు.

ధృత: కుమారా! అట్లు గాకుండిన సకల రాజన్య కుమారులు యుష్మత్పరిచర్యల యందప్రమత్తులై యున్నవారా! సకలసేవకపరివార వందిమాగధ దౌవారిక దండనాయక మంత్రసామంతులు నీకుం దగిన మర్యాదల నాచరించుచున్నారా?

దుర్యో: తండ్రీ! తద్వ్యతిరేకంబుగ నెవరు వర్తింపఁగలరు. అతిభయంకరశాసనులగు దేవరయాజ్ఞ నతిక్రమింప నెవ్వరును సమర్థులుకారు.

ధృత: కుమారా! కురువృద్ధ జనాచార్యవరులెల్ల నీదెస తొంటినెయ్యం బున నున్నవారే. అదియునుఁగాక యీయెడల నీ పరితాపంబు నకును, నీ మనోవేదనకును గతంబెద్ది? అనృతవాక్య ప్రలా పంబుల వర్తిలితివో! త్యాగ విషయమున వాగ్దత్త మొసఁగి యీ కుంటివో! అభయప్రదానంబొసంగి శరణాగతరక్షణంబు సలుపవైతివో; తోడిరాజకుమారవరులందు గదాధనుర్వ్యాపారం బులఁ బ్రజ్ఞాహీనుండవై యవమానింపఁబడితివో; ఏదియో తెలిపి యత్యధికతరాతురతతో మఱుగుచున్న నాయంతరంగ మునకు శాంతి కలుగఁజేయుము.

దుర్యో: తండ్రీ! ఏమనివాకృచ్చువాఁడను. అదియెద్దియునుగాదు. అనన్యహృదయ గోచరంబగు నొక్క మహావిచారంబు నిదాఘ సమయ జనిత మహోష్ణాతపవిశేషం బల్పజలబిందు సమేత జలాశయంబు విధంబున నా హృదయంబును దహించుచున్నది. మదీయవేదనా శాంతికరములగు కార్యము లాచరించెదరేని మీకుఁ దెల్పువాఁడ, లేనిచో నా పురాకృత కర్మఫలానుసారంబు గఁ గుందుచు నేదే నాచరించెద.

ధృత: అబ్బాయీ! నాదెస నింకంత సంశయంబుండనేల? నీకు సంతో షంబు కలుగఁజేయనియెడ నాకు రాజ్యసుఖమేల? నేనేల? అది వేగంబ నుడివిడినచో వడిగ నీయలమట తీఱఁగలదు.

దుర్యో: తండ్రీ! సావధాన మనస్కుండవై చిత్తంబునఁగుమారవాత్స ల్యము బూని యాకర్ణింపుము. చెప్పెద. పాండురాజ కుమారులు- (అని ఆగును)

ధృత: (తనలో) ఈతండు తనవేదన నాకు బోధనచేయఁదలంచి

పాండురాజకుమారులని యారంభించుచున్నాఁడు. ఇది యేమో చేటునకు మూలముగదా!

దుర్యో: పాండురాజకుమారులు మత్స్యహోదర శతంబుకంటెను, నాకంటెను, సకల శస్త్రాస్త్రవిద్యారహస్యంబులందును గదాయుద్ధమర్మంబులందును బరరాజనిర్మితవ్యూహభేదన సాధనంబులగు సమర నైపుణ్యంబునందును అధికతర ప్రజ్ఞాసమేతులై యుండి నిఖిల భువనజన వినుతింబొందుచున్నవారు. అదియును గాక-

ధృత: కుమారా! అదియంతయు నీ కురువంశంబునకుఁ గీర్తిసంపాదకమే కదా! తరువాత, తరువాత.

దుర్యో: తండ్రీ! నీవట్లు వచింపఁబోకుము. కీర్తిసంపాదకంబు గాదు, నాకార్తి సంపాదకంబు. పాండు నరనాథ తనూజు లత్యధికోన్నతిం గాంచిన నాహృదయంబు తటతట ధ్వానంబులం గొట్టుకొనుచున్నది. తదీయ బలంబును, వృద్ధియు, యశంబును మీకు మోద కారణంబు కాని నాకుఖేదకారణంబు. ఆకుంతీ కుమారుల యం దిదినఱకే కురుభూములంగల ప్రజలెల్ల మహానురాగ బద్ధులై యున్నవారు. దైవదత్తంబగు తదీయ ప్రజ్ఞావిశేషంబులకే హృదయమందు పరితపించుచుండ,నయ్యుధిష్ఠిరు యువరాజుఁ జేతురని గూడ వినియుంటిని.

ధృత: కుమారా! పాండవేయులు బలోన్నతిస్ఫార యశోవిశాలురయినచో నీవును నేనును యశోభరితులమైనట్లే యూహింపవలయును. భవత్పితృవ్యకుమారులు లోకఖ్యాత కీర్తులుగానుంట నీకుమాత్రము గౌరవముగాదా? అయ్యుధిష్ఠిరుండు నీకుజ్యేష్ఠుండు గావున రాజ్యప్రతిష్ఠుండగుటధర్మంబు. వానింగూర్చివగవకుము.

దుర్యో: తండ్రీ! దుఃఖింప వలదని చెప్పుట ఆశ్వాసించువారికి సుకరమే గాని దుఃఖానుభవతప్తులగు మానవుల కూఱడిల్లుట సుకరంబుకాదు. అదిగాక పాండుభూవల్లభుం డెల్ల జగంబులఁ బెల్లున గెలిచి సకల సుగుణగణాలంకృతుండగుటచే నాతండు దీరినను ప్రజాను రాగం బాతని దెసఁ దీరదయ్యె. ఆతని కుమారు లా రాజేంద్ర చూడామణి కంటె సర్వగుణముల యందును బలపరాక్రమంబు లందును నధికులై యున్నారు. ఏతత్కారణంబున వారియెడ జనానురాగంబు ద్విగుణీకృతమైనది. ఆదిని పాండుభూకళత్రుండు ధరిత్రీ చక్రంబు చక్రాయుధుని కృప నవక్ర పరాక్రమవిక్ర మంబులఁ బరిపాలించెను. నేఁడు తత్పుత్రుండగు నయ్యాజాత శత్రుండు ధాత్రీశుండైన యెడల తదనంతరంబు పూజ్యంబగు రాజ్యంబు తత్పుత్రులకే యొసంగఁబడు. నీపుత్రులమైన మాకు రాజ్యభ్రంశ మహాపరాభవమే కాక యన్యజన సేవానైచ్యంబు కూడ ప్రాప్తించును. నీకుమారులమగుట మా కింతగతి పట్టెను.

ధృత: దానికి మనమేమి సేయువారము. పితామహుండును, సురాసుర మనుజైక పూజ్యుండును, దేవవ్రతుండును, రణరంగ నిర్జిత భృగురాముండును అగు గాంగేయుఁడును, అశేషవిశేషశేముషీ ధురీణత నిర్జరాచార్యప్రతిమానుండును కళాపారీణుండును నగు విదురుండును యుధిష్ఠిరునకు రాజ్యమొసంగ నుద్యోగించు చున్నారు. మనమేమి చేయఁగలము.

దుర్యో: అట్లుగాదు. కౌరవరాజ్యభర్తవు నీవు. పితామహుండు రాజు కాఁడు. అతఁడు సకలరాజ సమక్షంబున రాజ్యంబు గైకొననని వ్రతముఁబూనినవాఁడు. నీచెప్పినచొప్పున కతండంగీకరించును.

అంగీకరించని యెడల మాత్రము భయమేమి? విదురుండును మనగేహంబున దేహంబు పోషించుకొనుచు, హంసతూలికా తల్పంబున విషోరగంబున్నట్లు, నిరంతరంబును పాండునందన పక్షపాతంబునఁ దేలుచు వారలకులగ్గును మనకెగ్గును నగ్గలంబుగఁ జేయుచున్నవాఁడు. వానికి రహస్యవాక్యంబొండు వచించిన నా క్షణంబున దానిని వారికిందెలియఁజేయును. ఆతండు మహా ద్రోహి. వాని వదనదర్శనంబు మహాపాతక హేతువు.

ధృత: నాయనా! నీవు బాలుండవు. చిరకాలానుభవ పరిజ్ఞానహీనుండవు. ఈ భరత రాజ్యదుర్గమునకు మందాకినీనందన భుజాదండ ప్రాకారంబును, విదుర మనీషా విశేషప్రాకారంబును, నను ప్రాకారద్వయంబు గలదు. ఏతత్ప్రాకార విసర్జనం బాచ రించి యా కురుముఖ్యుల నిరాకరించిన సకల భరతకులసముద్ర క్షోభంబగు. కావున తదీయ వాక్యోల్లంఘన మహాపరాధంబు చేయఁజాలను. నీవెఱుంగవు. ఊరక సుఖం బుండుము.

దుర్యో: అయ్యో తండ్రీ! నాదెస నీకంత నిర్దయ గలుగనేల. మదీయ హృదయవేదనా వివర్ధకంబగు నా కార్యంబు మాన్పరేని నిశ్చ యంబ మరణంబు నొందెద. మత్కాయంబు వాయు ననంత రంబు మీరలు పరమసుఖంబున నుండఁగలరు.

ధృత: (చెవులు మూసికొని) హరిహరీ! కర్ణశూలాయమానంబులగు నీ కఠినవచోవిశేషంబులు నన్ను బాధించెడు. వాగ్భల్లంబుల మదీయ హృదయ కుహరంబు వ్రయ్యలుచేయు నీదెస నేనేమి యుపకా రం బాచరింపఁ గలనో యెఱుంగకుంటిని.

దుర్యో: తండ్రీ! అంబాలికానందనుండగు పాండుమహీపాలకుని యం దలి యనురాగంబు విసర్జించి గంధవహనందన సుత్రామపుత్రి

మాద్రేయ సమేతంబుగా నయ్యుధిష్ఠిరు హస్తిపుర పుటభేదనంబు ననుండి పాఱద్రోలవలయు, అన్యథా యొనర్చిన మీపాలికి నేఁ దీరిన వాఁడనే,

ధృత: (తనలో) అయ్యో! దైవమా! కుమార వత్సలత కల్గియుఁ బాప కార్య నిర్వహణంబునందు చిత్తంబుఁ జొత్తిలకున్నది. అట్లుచేయ కుండిన గుమారుండు మృతుండు కాఁగలఁడు. కర్తవ్యంబెద్దియో యెఱుంగఁజాల కున్నాను. (ప్రకాశముగా) కుమారా!

తే॥ గీ॥ శకుని కొండెపుఁబలుకులు చెవులు నీకు
అంగరాజు తంత్రములు పథ్యములు నీకు
విదురు పల్కులు నాపల్కు విసము నీకు
అయ్యయో యెట్లు తీరునీ యార్తి నాకు.

శకుని కొండెములు విని పాలిత దుర్నయుండవై బేలతనంబున నీలీలఁ బలుకకుము. గాంధారేయ పాండవేయులు పరస్పర స్నేహంబున క్షీరనీరంబుల చందంబున నందంబుగఁ బొందు గూడి యున్నచో భరతవంశంబు శాత్రవ దుర్నిరీక్షంబై యుం డును గావున నీయుద్యమంబింక నంతంబు నొందింపుము.

దుర్యో: ఆఁ! నాయంతంబు నొందించెద. ఇంకమీకును నాకునుఁ దీఱి నది. ఇదిగో దుర్యోధనకుమారుండు లోకాంతరగతుండయ్యె నవిన సమాచారంబు కతిపయవాసరంబుల వినఁగలరు. (అని వెళ్ళఁబోవుచున్నాడు)

ధృత: (తొందరతో) కుమారా! దానికిందగిన పెర వూహింతము... తొందర పడనేల? కూర్చుండుము.

దుర్యో: (కూర్చుండి) పాండుకుమారులను జననీ సమేతంబుగా వారణా వతంబున నివాసం బొనరింపఁబంపుఁడు. ఇచ్చట కురువంశ సామ్రాజ్యంబు నేనేకచ్ఛత్రింబుగఁ బరిపాలించుచుండ వారి నిచ్చటకుఁ బిలుచుకొని రావచ్చును.

ధృత: కౌరవాన్వయ సంపూర్ణ మహార్ణవం బీదుర్ణయంబున ఘూర్ణ మానం బై యుండును. మందుండనగు నేను నందనులచే నెన్నిసింపఁలఁ బొందుదునో. కార్యంబు దైవాధీనంబు. కుమారా! అట్లే చేయు దునులే.

దుర్యో: నీవట్లుచింతింపనేల! పితామహుండును, విదురుండును, కుంభసంభవుండును నంగీకరింపరేని మనకేమి భంగంబువాటిల్లు! నీవు సెమ్మనంబున, భయంబు దక్కి వర్తిల్లుము. విదురాదులు నిమనంబున భయంబు చొప్పించి మరలనీయుద్యమంబు మార్పఁ గలరు. తదీయవాక్యంబుల నాలించి మనసుమార్చుకొన కుం దురని తలఁతును.

ధృత: నీ కప్రియకరంబగు కార్యంబు ధైర్యంబున నేనాచరింపఁగలనా? నీకంటెఁ బ్రియతమ పదార్థంబు ప్రపంచంబున నాకొండెద్దియు లేదు.

దుర్యో: గాంధారరాజాంగవసుంధరావల్లభులును, సింధు క్ష్మాపాల దుశ్శాస నాది బాంధవ మిత్రవర్గంబులును నాకొఱ కెదురు చూచుచుం దురు, అనుజ్ఞ నొసంగిన నరిగెద. ఈదినముననే పాండ వేయులను బాఱఁద్రోలవలయును.

ధృత: నాయనా! అట్లే చేయుదును. నీవిఁకఁ బొమ్ము.

దుర్యో: నమస్కారము.

(నిష్క్రమించును.)

ధృత: (తనలో)

తే।గే। కొడుకు నుడువులు వింటినా కులము చెడును
కులము మేలెంచికొంటినా కొడుకు చెడును
కొడుకు కులమును జెడకుండ నడుపవలయు
కానిచో వంశంబునకెల్ల హానిగల్గు.

ధృత: సంజయా! విదురాలోచన మొక్కటియు, దైవనిర్ణీత మొక్కటియు నైనది చూచితివా. విదురుండింకను రాకున్నవాఁడేమి.

సంజ: అది సత్యమే కాని పుత్ర దుర్మంత్రిబోధనాదీనచేతస్కులరై దేవర యిట్లు పాండునందనుల పరిభవించుట యుక్తంబుగాదు. ఇది భరతకులంబున కొక్క కళంకంబే.

ధృత: (వినకయే) విదురాగమన నిరీక్షకుండనైన నాకు వాని దర్శన మతి దవీయమగుచున్నది.

విదు: (ప్రవేశించి, తనలో) ధర్మనందన యౌవరాజ్య పట్టాభిషేక మహోత్సవమున కుత్సాహంబున దేవప్రతుండు సమ్మతినొసంగెఁగదా. ఈ చంద్రవంశంబు మిక్కిలివర్ధిల్లఁగలదు. (ప్రకాశముగా) ధృతరాష్ట్ర మహారాజా! అంతిపురమున భీష్మునితో మంతనంబుండి తదభిప్రాయంబెఱిఁగి వచ్చినాఁడను. ఆతనికీ కార్యంబు సమ్మతంబు.

ధృత: (వినక) విదురా! పాండవేయులు కొండొక కాలంబు దనుక వారణావతంబున నిల్చుట మేలు. కౌరవ సామ్రాజ్యంబు చతు

స్సాగర పర్యంతంబగుటచే హస్తినగరంబున మనమును వారణా వతంబున వారును నివసించి పరిపాలించిన రాజ్యం బనన్య భేద్యంబై యుండు.

విదు: (అదిరిపడి తనలో) ఇప్పటి కొక్క ముహూర్తంబు క్రిందటివఱకును పాండవజ్యేష్ఠుండగు యుధిష్ఠిరుని రాజ్య ప్రతిష్ఠితునిఁ గావింతునని యీ యవసరంబున నిట్లసంబద్ధ ప్రలాపంబు లాడుచున్నవాఁడు. నా నిర్గమ నానంతరంబున మాయోపాయశోధనుండగు దుర్యోధనుండు వచ్చియుండవచ్చును. (ప్రకాశముగా) రాజా! కౌరవేశ్వరా! నిర్హేతుకముగా సమస్త ప్రశస్త బాంధవ కురువృద్ధ జనసమక్షంబునుండి యప్పాండవుల నేల దూరదేశంబులకుఁ బంపెదవు. ఇది శ్రేయః కాముండవగు నీకు నీతికాదు. ఊరకుండుము.

ధృత: విదురా! అన్యథా బుద్ధినూహించి నన్నూరక క్రూరనారాచప్రతిమానంబులగు నీవాక్యంబుల బాధపెట్టకుము. వారెచ్చటనుండినను సురక్షితులే. ధార్తరాష్ట్రులు వారి కపకారంబు తలపెట్టరు. భయపడకుము.

విదు: ఎట్లయినను సరియే. పితృవిహీనులును అభాగ్యులునగు నాకుంతీ పుత్రుల పూర్వజన్మార్జిత పుణ్యఫలం బెట్లున్నదో యట్లగును. విధినియోగ మహార్ణవంబు మానవప్రయత్నరూపోడుపంబున దాట దుస్సాధ్యంబు.

ధృత: నీవేమియు భయపడకుము. సంజయా! మత్సహోదర వీరపుత్ర పంచకంబును మాతాసమేతంబుగ నిచ్చోటికిఁ గొనిరమ్ము.

సంజ: దేవా! చిత్తము. (తనలో) ఈ కురుముఖ్యుండు పాండుమహీమండల నందనాపకారాభిలాషియై యున్నవాఁడు. పితృవిహీనులకు దైవమే సహాయంబు.

(నిష్క్రమించును)

విదు: రాజా! సకలరాజ లోకవిఖ్యాతంబగు కురువంశంబున కీ కార్యంబు కళంకమగుట నిస్సందేహంబు. రాజకులంబులందు మన కవమానము రాకమానదు. దీనిని వారించి కురుకుల హితంబు గావింపుము.

ధృత: (వినక) ఎవ్వరు వచ్చుచున్నవారు. పాండవ సమేతుండైన సంజయుఁడా యేమి?

(సంజయుఁడు పాండవులతోఁ బ్రవేశించును.)

సంజ: మహారాజా! దేవర యాజ్ఞానుసారముగాఁ బాండవులు వచ్చి యున్నారు.

ధృత: అతి త్వరితగతి వారినిటు రానిమ్ము.

(పాండవులు ప్రవేశింతురు.)

ధర్మ: అంబికేయుం డీ దినంబున సభామంటపమున కరుగక మునుపే మందిరముననుండి మనలం బిలిపించుచున్నాఁడు. కారణమేమో యూహింపఁజాలకున్నాను.

భీము: అన్నయ్యా! కారణమేముండును ...(చూచి).... ఏమిది. అపశకునంబు లుప్పతిల్లు చున్నవి. నానా మహీరుహ సంచారజనితాయాసంబగు వాయసంబు దక్షిణభాగంబునుండి వామపార్శ్వంబున

కరుగుచున్నది. మనకెట్టయెదుట నొక సారమేయంబు యామంబునుండి కూయిడి మొఱుగుచున్నది. కాక ఘూక ఘూత్కారంబు లధికంబుగా నున్నవి. ఈ దుశ్శకునోత్పత్తి మదీయ చేతోంతరంబున నాశ్చర్యము పుట్టించుచున్నది.

అర్జు: అన్నయ్యా! భవద్వాక్యంబులు నిశ్చయంబులు. మనమేపురము వృద్ధజన సంసేవనంబున కరుగునపుడు రాజద్వార వినిర్గమ సమయంబుననే క్రమముగ శుభసూచకంబులగు శకునంబులు గన్పట్టు చుండెడివి. నేఁడు తద్వ్యతిరేక మగుచున్నవి.

ధర్మ: తమ్ములారా! ఏమి మీవెఱ్ఱి. విదురాది కురువృద్ధజన సమేతుఁడైన యంబికానందనుని పాదారవిందములకు వందనముచేయు నభిలాషతో నరుగునప్పుడు దుశ్శకునంబులు గల్గెనను చింతయేల? జనకుని సముఖంబునకు తనయులు పోవునపుడెట్టి శకునంబులైనను భయములేదు. జనకుం డపకారముగావించునా? స్వప్నంబులును గ్రహచారంబులును, దుశ్శకునంబులును నిరంతరంబు నిక్కువంబులు గానేరవు. ఆవంత యావంతయు నంతరంగంబున నిలుపక శాంతిఁబొందుఁడు.

భీము: (కోపముతో) అన్నయ్యా! కుమార దుర్మంత్రి బోధితుండై యాంబికేయుండు కొండొక యపకారంబు గావింపఁగలవాఁడని యూహించుచున్నాను. అయినది కానిండు.

ధర్మ: తండ్రీ! అనుజ సమేతుండై పాండవజ్యేష్ఠుండు నమస్కరించుచున్నాఁడు.

కుంతి: ధృతరాష్ట్ర మహారాజా! నమస్కారము.

ధృత: ఈప్సితార్థసిద్ధిరస్తు. కుమారులారా! కౌరవ సామ్రాజ్యంబు చతుస్సాగర పర్యంత విస్తీర్ణంబుగదా!

ధర్మ: తండ్రీ! ఈ వాక్యంబు నిక్కువంబే.

ధృత: (విచారముతో)

సీ. పుట్టు గ్రుడ్డికి నేల పుడమియేలుట నాక
కృపనన్ను గద్దె యెక్కించినాఁడు
పుడమి ఱేఁడుల నొంచి యుడుగరల్ గొనితెచ్చి
ప్రేమమై నాకు నర్పించినాఁడు
నాల్గుసంద్రంబుల నడిమి నేలలయందు
మించి నాయాన సెల్లించినాఁడు
ధన సంచయంబులఁ గొనితెచ్చి నాచేత
నెన్నొ జన్నములు సేయించినాఁడు.

తే।గీ। మంచి వాఁడని సత్కీర్తిగాంచినాఁడు
మీ చిఱుత ప్రాయమున నస్తమించినాఁడు
నాకు గారాబు తమ్ముండు మీకుఁదండ్రి
బల్లిదుండగు పాండుభూవల్లభుండు.

వినయనయభరిత చేతస్కుండైన యాతం డల్పవయస్కుం డయ్యు జ్యేష్ఠుండనగు నేను సజీవుండనై యుండ దారుణారణ్య సీమల లోకాంతర గతుండైనాఁడు.

(అందఱు విచారించుచున్నారు)

రాజ్యంబువిస్తారమైనచో రాజకుమారులు నానాదిశలనుండి పరిపాలించి యాయాదేశవాసుల సుఖదుఃఖంబుల నరయుట శ్రేయంబు

కావున నీవు మాతా సహోదర సమేతుండవై యప్రమత్తుండవై వారణావత పురరాజ్యంబుననుండి దేశక్షేమం బారసి ప్రజారంజకుండవై ధరాపరిపాలనం బాచరింపుము.

ధర్మ: చిత్తము. (తనలో) ఈ మహాధరాధీశ్వరుండు వాక్రుచ్చినదంతయు నిక్కువంబు. అట్లే చేయవలయును.

ధృత: అమ్మహానగరరాజంబుననుండి నిరంతర సువర్ణాక్షీణ దక్షిణా సమేత మహాధ్వర శతంబులాచరించి గోసహస్రాగ్రహారంబులు భూసుర పర్వివరుల కొసంగి పితృసమానుండవుగమ్ము. కుమారా! దీన నీకుం జేటు లేదు.

తే॥ గీ॥ నన్ను మన్నించు నాచిన్న యన్నలార
అలుక యెఱుఁగని కురుజాతి మొలకలార
తగవుఁదప్పని పాండుని తనయులార
యింపుగదుర నాముద్దు చెల్లింపరయ్య!

ధర్మ: దేవరయాజ్ఞ అన్యథా యెట్లు కాఁగలదు.

భీము: (తల పంకించి) దుర్యశో బంధురుండును దుష్కార్య నిర్వర్తన ధురంధరుండును నగు నయ్యంధుండు మాపై నిర్హేతుక జాయమాన కటాక్షవీక్షణంబులంగలిగి వారణావతంబునకు మమ్ముం బంపుటలేదు. పాండురాజాన్వయ నిర్మూలన కేళీలోలుండై యిట్లాచరించుచున్నవాఁడు. (ప్రకాశముగా) అన్నయ్యా! మీరు పితృవాక్యపాలన లాలసులగుటచేఁ దదీయ వాక్య విలంఘన మాచరింప నుద్యోగింపరు. కావున వారణావత పురరత్నంబుఁజేర నిరంతర ప్రయాణంబులఁ బోదమురండు. విధి నియోగంబిట్లుండ ధృతరాష్ట్రనియోగం బెట్లన్యథా కానేర్చును?

ధర్మ: అమ్మా! వారణావతంబున కరుగుదము రండు. అనుజులారా! పోదము పదండు. (అని ధృతరాష్ట్రుని యొద్దకుఁబోయి)

చం॥ అరిభయద ప్రతాపుఁడయి యాశ్రితదేవ మహీరుహాంధుడై
గురుతర పాండుకీర్తియయి కుంజరసన్నిభ సత్వమూర్తియై
కురుకుల సార్వభౌముఁ డయి కుంభినిఁ జెల్లిన యట్టి పాండుభూ
వర తనయాగ్రజన్ముఁడిదె వందన మేర్పడఁజేయుఁ దండ్రికిన్॥

ధృత: దీర్ఘాయుష్యమస్తు.

భీము: పాండురాజాన్వయ క్షీరనీరాకరైరావతకుంజరరాజంబును శత్రుపక్ష మండలాధిప భయద మహాభిధానుండునగు భీమసేనుండు గురుచరణారవిందముల కానందమున వందనంబాచరించుచున్నవాఁడు.

ధృత: దీర్ఘాయుష్యమస్తు.

అర్జు: చం॥ కరిపురరాజమున్ విడువఁ గౌరవముఖ్య ననుజ్ఞఁగాంచి సు
స్థిర మతి వారణావతముఁజేర దలంచుచు నుండు వేళలన్
గరయుగళంబు నెన్నుదుట ఘట్టనచేయుచుఁ దండ్రి పాండు భూ
వరసుతమధ్యముండిదె యవారితభక్తి నమస్కరించెడిన్॥

ధృత: దీర్ఘాయుష్యమస్తు.

నకు: మాద్రేయాగ్రజన్ముండగు నకులకుమారుండు వినయపూర్వక వందన సహస్రంబు లొనర్చుచున్నవాఁడు.

ధృత: దీర్ఘాయుష్యమస్తు.

సహ: అంబాలికేయప్రియ తనూభవుండును కుంతీనేత్రోత్సవ వివర్ధనాకారుండునునగు సహదేవకుమారుండు జనకునకు నమస్కరించు చున్నవాఁడు.

ధృత: దీర్ఘాయుష్యమస్తు.

ధర్మ: అయ్యలారా! పోయివచ్చెదము. (అని విదురుని వంకఁజూచి) పృథానందన క్షేమంకర! క్రూరజన భయంకరా! మహాత్మా! కౌరవేశ్వరునను జ్ఞచెల్లించుటకై వారణావతంబున నివసించినను మా హృదయంబు మీ సదనంబుననే యుండును.

విదు: (దుఃఖముతో) కుమారులారా! మీకుం జిరాయుర్నిరామయంబులగుఁగాక. భవత్పునర్దర్శనం బతిశీఘ్రకాలంబున కాఁగలదు పొండు.

ధర్మ: సహోదర సమేతుండనై నమస్కరించుచున్నాఁడను.

విదు: దీర్ఘాయుష్యమస్తు.

కుంతి: మహాత్మా! పోయివచ్చెదము.

విదు: అమ్మా! ధార్తరాష్ట్ర నిర్మిత మహోపద్రవ సముద్రంబుదాఁటి యుష్మత్కుమారులు సుఖియింపఁగలరు. వగవకపొమ్మా. ఈ పురద్వార పర్యంతము మిమ్ముఁ బంపెద. రండు.

ధృత: సంజయా! ఈ దినమునఁ జిరకాల ప్రవర్ధిత స్నేహంలగు పాండుపుత్రుల విడనాడుటచే మనం బతివిచారాకరంబై యున్నయది. కావున నంతఃపురంబునకుఁ బోవుదము రమ్మా.

తే॥ గీ॥ తండ్రిలేని బిడ్డలటంచుఁ దలఁపనైతి
తగవుఁదప్పని వాంఛించు వగవనైతి
కొడుకుమాటలు విని కుంతి కొడుకులయెడ
కటకటా దోసమునకొడి గట్టుకొంటి.

(నిష్క్రమించుచున్నాఁడు)

(విదురుఁడు, పాండవులు, కుంతి బయలుదేరుచున్నారు.)

ధర్మ: (విచారముగా) మహాత్మా! విదురా!

చం॥ జనకుఁడరణ్యభూములను జచ్చినదాది కృపారసంబునన్
బెనిచితివీవు మమ్ములనుఁబేర్మి భవత్సుతులట్ల నేఁటికిన్
మనలకుఁ దీరెనయ్యా విధిమాయలుదాఁటగ శక్యమే యిలన్
గనుఁగొనువారమో మిముల క్రమ్మర లేదొ కటాక్షముంచుఁడీ.

విదు: (కన్నీటితో) ఆయుష్మంతుఁడా! భ్రాతృచతుష్టయంబు తోడను, మాతృదేవత తోడను యుష్మత్పునర్దర్శనంబతి శీఘ్రంబుగాఁ గాఁగలదు. అదియుఁగాక మీరు కృష్ణ ద్వైపాయన శిక్షితులరు. భారద్వాజ శిష్యులరు. పాండు ధరాతలేంద్రపుత్రులరు. మీ కభ్యుదయంబుఁ గలుగఁగలదు. మీరెందున్నను మీసుందర వదనారవింద సందర్శనంబందలి జనంబుల నానందంబు నొందించి మీయందు సురాగంబు పుట్టింపఁగలదు. అయినను మీకొక్క పరమరహస్య విషయం బుపదేశింపఁ గోరితిని. (ధర్మజుని దూరముగాఁ గొని పోయి చెప్పును)మీకు విషాగ్నుల వలన భయంబులు కలుగఁ గలవు. ఆవిషయంబున నప్రమత్త చిత్తులరై వర్తిల్లుఁడు. నేనరిగెద. (అని వెళ్లి పోవుచున్నాఁడు).

కుంతి: ధర్మనందనా! పాండునందన హితార్థియగు నవ్విదురుండు నీకు రహస్యంబున నుపదేశించిన యా యూహితం బెయ్యది?

ధర్మ: అమ్మా! ధారరాష్ట్రిలు మనోవాక్కాయ కర్మంబుల దురాలోచన దుష్ప్రలాప దుష్కార్యంబులు పాండవులపైన సలుపుచుందురు. అందు విషాగ్నుల విషయమై యత్యధిక జాగరూకతతో నుండవలయునని మహాత్ముండైన విదురుం డానతిచ్చెను.

భీము: (కోపముతో) భరతకుల పాంసనుండగు నయ్యాంబికేయుండు పుత్రవాత్సల్యమున జంకించుకయులేక యీ ప్రకారంబుగ నపకారంబులు చేయుచున్నాఁడు. మనమింక వారణావతంబునకుఁ బోవలదు. మరల హస్తిపురంబునకుంబోయి హస్తియూధంబులఁ బరిమార్చు మృగేంద్రంబు చందంబున సకలారాతినికాయంబు నిశ్శేషంబుగావించి, అశేషబాంధవ శ్రేణితో పితృపితామహార్జితంబైన రాజ్యంబుఁగైకొని యేకచ్ఛత్రంబుగా నేలుకొందము. రండు పోదము.

ధర్మ: తమ్ముఁడా! భీమసేనా! గురుజనానుజ్ఞ వడసి వారణావతపురంబును గొండొక కాలంబుండఁగలవారమని వాక్రుచ్చి మరలఁ గరిపురంబు చేరినయెడల సామంతరాజ కులంబులలో నదియొక నగుబాటు కాదా? దైవానుగ్రహంబు గలిగిన నెట్టి శాత్రవులును అపకారంబును లేశమాత్రమయిననుఁ గావింపఁజాలరు. కావున పోదమురమ్మ.

భీము: అన్నయ్యా! మీ శాంతంబు నా స్వాంతంబున దురంతచింత కలిగించుచున్నది. మీ యాజ్ఞ మా కవిలంఘనీయముగదా! ఏమి చేయుదును. (అని అందఱు కొంత దూరమునడచి పోవుచున్నారు.

# 2 వ రంగము

ధర్మ : ఇదే వారణావతముఁ జేరితిమి. తమ్ముఁడా! మనము స్యందనా రోహణము సలుపవలదు. ఆ జనసంఘంబిచ్చోటికి వచ్చువఱకే మనమచ్చోటికిఁ జెచ్చెర నరుగుదము. రండు. అమ్మా రమ్ము.

అర్జు : అన్నయ్యా! మనకు వాసోచిత గేహంబొండు మన మా జనంబులనడిగి యరయవలయును.

ధర్మ : తమ్ముఁడా! అట్లవశ్యము చేయవలయును. ఈ జనంబులోని జనులలో నెవ్వరైనను మనకు గృహమిచ్చి సకల సత్కారంబుల నాదరింపఁగలరు. రండు పోదము. (నడచుచున్నారు.)

(అప్పుడు పురోచనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

పురో: (తనలో) శహభాష్, వహావ్వా! నా కోరిక ఫలించినది. లాక్షాతైల ఘృతాదిదుష్పదార్థంబులతో నీ లాక్షాగృహనిర్మాణం బాచరించితిని. ఈ కార్యంబునకు దుర్యోధనమహారాజెంతయు సంతసించి నాకనేకాగ్రహారంబులు బహుమానంబొసంగును. ఈ గృహనిర్మాణంబున కనుగుణంబుగ పాండవులీ పురికరుగుదెంచిరి. పాండునందనులనీ లాక్షాగృహంబున నుండఁబనిచి యీ కృష్ణచతుర్దశి దినమందర్ధరాత్రింబున గాఢాంధకారమందు గృహద్వారం బంటించి వీరి పంచత్వంబెఱింగి యీ సంతోషవార్త దుర్యోధనున కెఱుంగఁజెప్పి పారితోషికంబులు పడసెద. ఇంక వీరలతో మాటలాడెదను. (దగ్గఱకువచ్చి) మహాత్ములారా! నమస్కారము. మీరెవ్వరు? తావక వృత్తాంతంబంతయు నా కెఱుంగఁజేయ ప్రార్థించుచున్నాఁడను.

ధర్మ : ఓయీ ! పాండు ధరాతలేంద్రు పుత్రులము. చంద్రవంశజులము. ఇమ్మహాదేవి మా జనని. వీరలందఱు మామక సహోదర వీరులు. నేనగ్రజుండను.

పురో : మహాత్ములారా ! యుష్మదర్థంబు నేనొక్క విచిత్ర భవనంబు నిర్మించితి. దానింజూడ మదీయ శిల్పశాస్త్రనిస్సహాయ నిర్మాణ నైపుణీ ధురంధరత్వంబు దేవరకుం దేటపడఁగలదు. దాన మీరు వసియింపుఁడు.

ధర్మ : సహోదరులారా ! అమ్మా ! యీతండు వయోవృద్ధుండు. అది యునుఁగాక మనదెస నత్యంత స్నేహబద్ధునివలెఁ గన్పట్టు చున్నాఁడు. తదీయనిర్మితంబగు నా గేహంబున వసియింతము.

అందఱు: అట్లాచరింపఁదగు. ( అని అందఱు అగృహంబుఁ జేరుచున్నారు)

పురో : (తనలో) లాక్షాతైలాదులచే నిర్మితంబాయెనని వీరలు గ్రహించి యందు వసింపరేమోకదా ! అయినను గోడలు సాంద్రచంద్రికా ప్రతిమానంబగు ధవళసుధారసంబుచే లిప్తంబులు గావించినాఁడను. వీరొకవేళ నిది యెఱింగిన నాకుఁ బ్రాణభంగము వాటిల్లు. అట్లయిన నర్ధరాత్రింబున నెవ్వరితోడం జెప్పక పాఱిపోయెద. (ప్రకాశముగా) అయ్యా ! యుధిష్ఠిరా ! దీని నిర్మాణనైపుణిం దిలకించితిరా.

ధర్మ : ఓయీ ! చూచితిని. తమ్ములారా ! యీ భవనంబు వివిధ వాతాయనవార్రిత శోభితంబును, నిర్మలమణిమయవేదికా విరాజితంబును, సకల చిత్ర విచిత్ర వస్తు సంపూర్ణంబునై యెట్లున్నదో చూడుఁడు. అహోహో ! (అని చూచును.)

పురో : (తనలో) ఇంక నేనిందునిలువగూడదు. నేఁబోయి పాండునందన మారణమునకు నిరపాయంబులగు నుపాయంబుల నూహింపవలయు, నేఁబోయెద (ప్రకాశముగా) ఆర్యులారా! నాకు సెలవొసంగిన నేఁబోయివచ్చెద.

ధర్మ : ఓయీ! పోయిరమ్ము. మేమిచ్చట నుండునంతకాలంబును మాకు నీవనుదినంబును గనఁబడుచుండుము.

పురో : చిత్తము. (తనలో) మీచావు సమీపించినది. ఇంక నెన్నిదినంబులు. (నిష్క్రమించును.)

ధర్మ : (లేచి గోడలుచూచి ఆశ్చర్యముతో) తమ్ములారా; యీ గృహంబు లాక్షాతైలాదివస్తురచితమని తోఁచుచున్నది. పరీక్షించి చూడుఁడు.

అర్జు : (పరీక్షించి) అన్నయ్యా! అది సత్యమే. ఎవ్వరిప్రేరణచే నేమానవాధముండు దీనిని రచియించి యుండవచ్చును?

ధర్మ : తమ్ముఁడా! మఱియెవ్వఁడు.

భీము : (మహాకోపముతో) అన్నయ్యా! కురుకుల కళంకభూఁతుడగు నాపాపుండు పాండునందన దుర్వార ప్రజ్ఞావివేక విశేష దర్శన జనిత మహేర్ష్యాగ్రహగ్రస్తుండై, ప్రచండప్రభాకర భీకర కరనికర సంతప్తాల్పజలబిందు సందోహయుత సరోవరానుకార హృదయుఁడై, యదయుఁడై, వికారాకారియై, పాపకారియై జగంబున పాండవంబుగఁ జేయఁదలంచె. ఏ తత్పాపకర్మ దుర్మంత్రి ప్రేరణంబున నీచ నిశాచరుండగు పురోచనుండు మనల నీ గృహంబునందుంచి దహింపఁదలంచె. తదీయ కల్పితానల్పమాయాసముద్రమగ్నులమై మనమీ యంతఃపురంబుఁ బ్రవేశించినారము. (పండ్లు కొఱుకుచు) హా, ధార్త

రాష్ట్రి కులాధమా! దుర్యోధనా! పాండునందన నిష్కారణ దారుణ మారణక్రియాకేళీపాళీలోల చేతస్కుండవగు నీ వర్ధాయుష్కుండవుసుమీ. అన్నయ్యా! అకులాంతకునంతకు నంతఃపురంబునకంపుదమురండు. (అని వెళ్ళఁబోవును.)

ధర్మ: (చేయిపట్టుకొని) అనుజా! ఆ దురాత్ముండు నిర్హేతుకముగా మనలనంత మొందింపఁదలంచిన కారణమ్మున నాతనికి దైవంబే యపకారంబుగావించును. వాసుదేవునిపై భారముంచి నిలువుము.

భీము: అన్నయ్యా! తాము సహోదరదారుణవిదారణంబునకైనను సమ్మతింతురుగాని యమ్మనుజాధమునిపైఁ బోనీరుగదా! ఈ శాంతంబు మన యంతంబునకే వచ్చినది.

ధర్మ: నీవు నిష్ఠుర ప్రలాపిపై నాహృదయవిదళనంబుఁజేయకుము. తమ్ముఁడా! అర్జునా! నామనము—

భీము: అట్లయిన నపాయబంధురంబగు నిమ్మందిరంబు విడిచిపోదము. రండు. ఆహా! విదురుండు మహానుభావుండు? ఆ మహాత్ముండు మనయెడ నాచరించిన యుపకారంబునకు బ్రత్యుపకారంబు లెన్ని జన్మంబులెత్తినను చేయలేము. ఆతండు విషాగ్నులవలన భయంబు గలుగునని ముందె చెప్పియుండెను. ఇంక నన్యగృహ నివాసము చేయుదమురండు.

ధర్మ: అట్లుగాదు. తమ్ముఁడా! మన మీభవనంబుననే నివసించి పురోచను దురాలోచన సాంతముగా నెఱుంగుదము.

భీము: అన్నయ్యా! సప్తజిహ్వాజిహ్వామధ్య దగ్ధశరీరులమై విగతజీవులమైనవెనుక వానియాలోచన నెఱుంగుటెట్లు? కావున నీక్షణంబ యీశయ్య విసర్జనము చేయుదము.

ధర్మ: అట్లుగాదు. గురుజనానుజ్ఞ నెఱవేర్పకుండిన కౌరవవంశసముద్ర క్షోభంబగు. ఈభవన విసర్జనముఁజేసిన వారుమన కన్యవిధంబగు నపాయంబు చేయఁగలరు. కావున నిచ్చటనేయుండి యిమ్మహా విపత్సముద్రంబు దాటుటలగ్గు. అన్యథా విధంబెగ్గు.

భీము: అన్నయ్యా ! దేవరచిత్తానుసారంబ వర్తింతును. మదాగ్రహంబు నిరర్థకమని నేనిదివఱకే యెఱుంగుదును. యుధిష్ఠిర మహారాజా సోదరుఁడనై యేనాఁడుదయించితినో యానాఁడే నాదురంతాగ్రి హస్తింబేరమంబు తద్బలవదాజ్ఞాంకుశంబుచే నిగృహీతంబని గుర్తించితిని.

ధర్మ: తమ్ములారా ! మనమప్రమత్తులమై యుండవలయును.

నకు: అన్నయ్యా ! యెవ్వరో వచ్చుచున్నారు.

ధర్మ: ఎవరు ? (ఖనికుఁడు ప్రవేశము)

ఖని: మహాత్మా ! పాండవాగ్రజా ! జయము. జయము. విదుర నియుక్తుండనై భవత్సమ్ముఖంబున కరుదెంచితిని. ధార్తరాష్ట్రా గ్రజుండీమాసంబున కృష్ణచతుర్దశీ దినంబున నీలాక్షాగృహం బంటించి నిద్రాసమయంబున మిమ్ము సమయింపఁదలంచె. అందు లకీ మందిరంబునుండి తప్పించుకొని పాఱిపోవుటకు మహా బిలంబొండు త్రవ్వుమని విదురుండు నన్ను నియోగించెను. నేని చ్చటికివచ్చితిని. నేను ఖనికుండ.

ధర్మ: (విస్మయముతో) ఆహాహా ! ఎంతకష్టము. తమ్ముల ... ... ...

భీము: (మహాకోపముతో) హాదురాత్మా ! గాంధారీగర్భభారభూత ! భరత వంశపయోనిధాన బడబానలా ! పాండుమహారాజ పట్ట

మహిషియగు నీమాతృదేవతను, ఆదిగర్భేశ్వరుండై కౌరవ శ్రేష్ఠుఁడగు నిప్పాండవ జ్యేష్ఠుని, మృదుమధుర భాషణ భూష ణుండగు నీధనంజయుని, నవపల్లవలావణ్యాకార సుకుమార వీరులగు నీమాద్రీకుమారులను గాఢనిద్రా సమయంబున సమ యింప సమకట్టిన నీపాతకంబునకు మితిలేదురా ! తలంచిన దంతయుఁదథ్యంబయ్యె. విదురవాక్యంబులు దృష్టాంతంబుల య్యెను. ఆతండు బుద్ధినిపుణతచే విపత్ప్రదంబులగు చెట్టలు పట్టంబుగఁబుట్టఁగలవని యప్పట్టుననేకనిచెప్పెను. అయిన నిప్పు డేమి. ఓయీ ! ఖనికుఁడా ! అందుకేమికర్తవ్యంబని మహా త్ముండైన విదురుండు ఆనతిచ్చెను ?

అర్జు: అన్నలారా ! కుమారాస్త్రవిద్యాసందర్శన మహోత్సవ కాలము నుండియు నాధార్తరాష్ట్రకులాధముండు మనపైనోర్వలేకున్న వాఁడు. ఈర్ష్యాగ్రహగ్రహస్తుఁడైన నరుండెప్పుడును సంతోష విహీనుండై వేదనంబడుచుండు. అయినను భయమేమి ?

ఖని: ఈమందిరంబునుండి మహాబిలంబుత్రవ్వెద. దానినుండి యొక్క మహారణ్యంబునకుంబోవఁగలరు. కాని యాదినంబున నిశా సమయంబున నప్రమత్తులరై యుండుఁడని విదురుండు పలు మాఱునొక్కి వక్కాణించెను. జాగరూకతతో నుండుఁడు.

ధర్మ: ఓయీ ఖనికుఁడా ! నీవాబిలం బతిశీఘ్రంబునం దవ్వుము. పొమ్ము. మహాత్ముండైన విదురునకు నానమస్కారంబులని చెప్పుము

కుంతి: ఓయీ ! విదురునితో నావచనంబులుగా నిట్లుపల్కుము—"పుత్ర భిక్షంబు నాకీదినంబున నీవుదయచేసితివి. నీమేలుమఱవఁ జాలను" అని.

అర్జు: మాయందఱ వందనంబులు వేఁడ్వేఁడెల్పుము.

నకు: మా సేమం బామహాత్మునకు సంపూర్ణముఁగాఁ దెలుపుము.

సహ: మీచరణారవింద సందర్శనము గోరుచున్న సహదేవునిపైఁగటాక్షముంచుఁడని పల్కుము.

ఖని: చిత్తము. నే బిలము నిర్మించి యావలఁబోయెదను.

(నిష్క్రమించును.)

ధర్మ: మనలను దారుణలాక్షాగృహదవానల శలభంబులుగాఁజేయఁ దలంచిన యాధార్తరాష్ట్రాధమున కెవ్వరు నడ్డుపడరైరిగాఁబోలును. ధృతరాష్ట్రుండైనను, మందాకినీనందనుఁడైనను, నడ్డుపడరైరిగా. ఆహాహా—కాలమహిమ.

కుంతి: (గుండెలు కొట్టుకొని) అబ్బ! ఎంతటి పాపకార్యము తలపెట్టిరి. కుమారులారా! దీని దాఁటుటకు నుపాయమేదియు దోఁపకున్నది. ఏమి సేయుదము. అహా! పాపపుదైవమా! దేవదేవా! వాసుదేవా! కావ నీవెకావా! మహాసుభావా! మహితప్రభావా!

భీము: అమ్మా! కౌరవ కురంగ మృగేంద్రుండగు భీమసేనుండు నిరంతర పరిచర్యాధురంధరుండై యుండ యుధిష్ఠిరమహారాజుగారికిఁగాని, నీకుఁగాని, తమ్ములకుఁగాని భయమేమి? సటాసముత్పాటన, కుపిత కుంజరారాతి రీతిని పాతకులగు కురుజాతుల సూతసుత సమేతంబుగా భూతబలి యొసంగి నిహతారాతిమండలుండనై భూమండలంబు దిఙ్మండల పర్యంతంబుఁజేకొని యుధిష్ఠిరున కర్పణము సేయువాఁడను, వెఱవనేటికి?

ధర్మ: దానికి త్తటి యదనుగాదని యెద నూహించెన.

కుంతి: ధర్మనందనుని వాక్యంబు నిశ్చయంబు.

అర్జు: అన్నగారి వాక్యము సత్యమే.

నకు: అట్లయిన కర్తవ్యాంశం బెద్ది?

సహ: దానినిగూడ మన భీమన్నయే వాక్రువ్వవలెను.

భీమ: తమ్ముండా! సహదేవా! అవును. దానినిగూడ నేనే యూహింప వలయును. ఇదిగో చెప్పెద వినుండు. కృష్ణచతుర్దశీ నిశాసమ యంబున గాఢాంధకారంబున పురోచన ప్రముఖులు నిద్రాసక్తు లయినవేళ నేనీ లాక్షాగృహంబు పవిత్రుండగు వీతిహోత్రున కర్పణంబు చేసెద. తదనంతరము మన మందరము ఖనికకృత మహాబిలప్రవేశముచేసి యొండొక ప్రదేశంబున కరిగి తత్ క్షణంబు ప్రాణరక్షణం బాచరించుకొందము. దానంజేసి పాండు నందన సంహారణ దుష్కార్యప్రవీణుండగు నప్పురోచనుండు లోకాంతరగతుండగును. ఇదియే నాకుం దోచిన నిరపాయం బగునుపాయంబు.

ధర్మ: తమ్ముండా! యిది లెస్సయైన యుపాయంబు.

కుంతి: నాయనా! నీవెరవున కెంతయు సంతసించితిని.

అర్జు: ఇది "స్వయంతీర్ణః పరాన్ తారయతి" అను వేదవాక్యాను సారం బుగ నాత్మరక్షణ సాధకంబేకాక శత్రునిర్మూలన సాధనంబని కూడ చెప్పనొప్పు.

నకు: భీమసేనుని వాక్యంబు లనన్యజన శక్యంబులు.

సహ: అట్టి మహాబల నందనుండుండ మనకు భయంబేమి?

( తెరలో )

ఓహో వారణావత నివాస మహాజనులారా! ఈదినంబు కృష్ణ చతుర్దశి. మాసశివరాత్రి యగుటచే నందఱు శివాలయంబునకు రండు.

ధర్మ: తమ్ములారా! కృష్ణచతుర్దశీ దినంబు సంప్రాప్తమైనది. ఈదినంబున మనము ప్రాణసంరక్షణముఁజేసికొన వలయును.

భీము: తమ్ములారా! అన్నయ్యా! యుధిష్ఠిర మహారాజా! అమ్మా! అందఱులెండు. అన్నయ్యా! మాతృభ్రాతృసహితంబుగా మీరా బిల ప్రవేశంబు చేయుండు. నేనీగృహంబు హుతాశనార్పణంబు చేసివచ్చెదను. పొండు.

ధర్మ: తమ్ముఁడా! మహానలశిఖాజ్వాల లెగసి భగభగ పొగలెగయ మండునప్పుడు జాగరూకుండవై యుండవలెను.

కుంతి: అయ్యో! కుమారా! ఏప్రకారంబుగా జాగరూకుండవై యుండెదవోగదా!

అర్జు: అన్నయ్యా! నేనును సహాయార్థంబుగ నిలుతునా?

భీము: తమ్ముఁడా! గృహనిర్మాణంబునకు జనసహాయంబు గావలయును గాని గృహనాశనంబున కొక్కండు చాలఁడా? కావున నేనొక్కఁడ దీనిని దహించెద. మీరందఱు బిలంబుఁజొచ్చి మదీయాగమనంబు నిరీక్షింపుఁడు.

కుంతి: ఆయుష్మంతుఁడా! వేగమరమ్ము.

ధర్మ: చిరంజీవీ! నీకొఱకు నిరీక్షించుచుందుము. తమ్ములారా! అమ్మా! పోదమురండు.

(అపుడు భీముఁడుతక్కఁ దక్కినవారు బిలప్రవేశముచేయుదురు)

భీము: ఇద్దురాత్ముండగు పురోచనుఁడెచ్చట నిద్రాసక్తుఁడై యున్నవాఁడో యెఱింగి వాని శయ్యాతలంబుచెంత ముంచవంటించెద. (నాల్గు మూలల వెదకి) ఓరీ! దురాత్మా! మద్యపానమత్తుండవై చిత్త స్థైర్యములేక నిద్రించుచుంటివా! నీయాయువు నేఁటితోఁ జెల్లినది (అనిమెల్లగా) ఈదీపికతో భవనంబు దహించెద. (అని అం టించి నిష్క్రమించును.)

( తెరలో )

అయ్యో! పాపాత్ములెవ్వరో పాండునందన నివాసయోగ్యంబైన లాక్షాగృహం బంటించిరి. పాండునందనులు జననీసమేతంబుగాఁ బరలోక గతులయిరి. హా! ఎంతకష్టము! అయ్యో ఏమిచేయఁ గలము. వారణావతవాసులమైన మేమెంత నిర్భాగ్యులమోగదా! దురాత్ములగు కౌరవాధములు బ్రతికియుండి సజ్జనులగు పాండవులు మృతినొందుటకంటె దారుణతర కర్మంబేమిగలదు? విధి నియోగంబిట్లుండిన నేమిచేయఁగలము.

ప్రథమాంకము సంపూర్ణము.

---

# ద్వితీయాంకము

*హిడింబాసురు వనము*

(అప్పుడు హిడింబాసురుఁడు వికృతాకారముతో బ్రవేశించును)

హిడిం: (తనలో) వహ్వా! సెబాస్! బళీ! చిరకాలంబునకు మదీప్సితంబు సఫలంబైనది. ఇమ్మహాకాంతార ప్రదేశములందు సంచారమొనరించుచున్న మహోద్దండ గండక, ఖుండాల పుండరీకాది జంతుజాలంబుల మధురరుధిరవసా మాంస మేదోకళేబరావయవంబుల నిరంతరంబును దిగమ్రింగుచు బ్రేవుమని త్రేన్చుటయేకాని పెక్కుదినంబులనుండి యొక్కనాఁడయిన మక్కువదీరఁజక్కని మనుష్య రక్తమాంసంబుల భింపదయ్యె. అది నేఁటికి సమకూఱె, ఎవ్వరో తెరు వెఱుంగక మరుంగుఁగాఁదలఁచి మూర్ఖులయి బాంధవులతో,గంధసింధురంబులు సింధురవైరిగుహాంతరంబుల కరుగుచందంబున నాయున్న యరణ్యంబుఁజొచ్చిరి. మర్త్యలోకంబునంగల మానవులకు. మహాసంక్రాంతి, సంవత్సరాది, నరకచతుర్దశీ ప్రముఖపర్వములు సంప్రాప్తమైనట్లు నేఁడు నాకాహారంబుగా నార్వురు మనుష్యులు దొరకిరి. ఇంకనేమైనను సరే వీరిని విడువను. ఆహాహా! బ్రహ్మ నాయందు మిక్కిలి మక్కువతోఁ జిక్కని యీనరులఁ బంపెను (చంకలుకొట్టుకొని) వహావ్వా! ఆఱుగురు మనుష్యులు. ఆఱుగురు. ఆఱుగురు. సరిగానున్నారు. ముగ్గుర నీదినంబునను. ముగ్గుర రేపటి దినంబునను నా కళనంబుఁ జేసికొందు. ఉదరంబు నిండు భోజనము లభించినది. తృప్తోస్మి తృప్తోస్మి. ఆ మనుష్యుల

భక్షించునందాక నా నోరూటలూరుచున్నది శీఘ్రంబ తినవల యును. బాగు, నాచెల్లెలు హిడింబరాలేదు. ఏమో ! దానింబిల్చెద. ఓహిడింబా ! ఓ హిడింబా ! ఓహో హిడింబా ఇటురా ! నీకొక్క సంతోషవార్తఁజెప్పెదను రా ! రా.

(అప్పుడు వికృతాకారముతో అఱచుచు హిడింబవచ్చును.)

హిడింబ: ఓహో అన్నయ్యా! ఇదిగో బ్రహ్మాదండిచెట్లలోఁ గూర్చుండి క్రొత్తగాలభించిన యడవి పందిని దఱుగుచున్నాను. ఇదిగో వచ్చుచున్నాను. ఎందుకు ? ఎందుకు ?

హిడింబుఁడు: చెల్లెలా ! నన్నుధృఢాలింగనము చేసికొనుము. మనకిరు వురకు నపూర్వపర్వం బొక్కటూరి వచ్చినది. ఆఱు, ఆఱు.

హిడింబ: (నవ్వుచు) అన్నయ్యా ! ఆ అనుచున్నావదేమి ? ఆఱు నూతన సత్వంబులొక్కసారి సంప్రాప్తమైనవా ? చెప్పు, చెప్పు, నా నోరూరుచున్నది.

హిడింబుఁడు; (నవ్వుచు) ఆఱు. ఆఱు. ఆఱుగురు మనుష్యులు వచ్చి నారు. మనకాహారము సంపూర్ణముగా దొరకినది. నాకానంద ముతో మాటరాకున్నది.

హిడింబ: ఎక్కడ దొరకిరి ? ఎక్కడ, చెప్పు. చెప్పు.

హిడింబుఁడు: అదుగో ఆ మహావటవృక్షంబుక్రింద నిద్రించుచున్నవారు. వారలచెంత నొక్కపురుషుఁడు కూర్చున్నాఁడు. నీవుచూచితివా ?

హిడింబ: చూచితిని. చూచితిని. నా సంతోషమునకు మేరలేకున్నది. అన్నయ్యా ! మనకు రెండుదినముల కాహారము ఆహాహా !

బ్రిహ్మచాలమంచివాఁడు, మనకీ దినమున నింత యుపకారము గావించినందులకు నేఁడు మన మాబ్రిహ్మను దిట్టవలదు.

హిడింబు: అవును, అవును, కాని యాలస్యము చేయకుము. నీవు పోయి యామనుష్యాధముల బలవంతముగాఁజంపి ముక్కలఁజెక్కలఁబ్రక్కలఁద్రొక్కి ప్రక్కలుచేసి, మెక్కుట కక్కఱకు వచ్చునట్లుగాఁజేసి బాగుగవండి యీక్షణంబ నాకడకుఁ దీసికొనిరమ్మి. పొమ్మి, వేగముగరమ్మి.

హిడింబ: అన్నయ్యా! అలాగుగావించి రక్తము దాహమునిమిత్తము పాఁతకడవలోఁబోసివాసెనగట్టిపెట్టెదను.నీకాకార్యమిష్టమేకదా!

హిడింబు: (నవ్వుచు) ఆ! మంచిపనిఁ జేసెదనంటివి మేలు, మేలు, సెబాసు, మంచి చెల్లెలవు. రా నన్నొకసారి కౌఁగిలించుకొని తక్షణమేపోయి యామాంసమువండి కొనిరమ్మి (ఆలింగనము చేయుదురు).

హిడింబ: అన్నయ్యా! నీనాలుకకంటె నానాలుక యెక్కువగా నూరుచున్నది. అదిగోచూడు (అనినోరుతెఱచి చూపి) నాకును వేగమె పోవలయునని యున్నది.

హిడింబు: నేనాలాగున చూడలేను. నీనాలుకతీసి నా చేతిలోఁబెట్టుము, చూచెదను.

హిడింబ: అబ్బా! అలాగున నేను చేయలేను. (అనివెళ్లుచున్నది)

హిడింబు: ఓసీ! చెల్లెలా! హిడింబా! అదియంతయు నీ వక్కడనే దిగమ్రింగెదవు సుమా! దొక్క బ్రిద్దలు చేసెదను. శీఘ్రిముఁగాఁ దీసికొనిరా! నేనాగలేను. నరమాంస భక్షణమందాశ యంతకం

తకెక్కువ యగుచున్నది. నేఁబోయి యింటనుండెద. (అనికేక వేసి వెళ్లుచున్నాఁడు) (తిరిగివచ్చి.) ఆకటం గటకట పడుచు నా ప్రాణంబులు దేహంబున నుండకున్నవి. ఓ హిడింబా! రా, వే గముగా! ఆమనుష్యులు నిన్నుఁజూచిన మాత్రమ్మున నెందైనను దాగిరా యేమి? అట్లయిన నీక్షణంబుననే నేవచ్చి మ్రుచ్చులంబరి మార్చెదను. ఏమిది? ఎన్ని పిల్చినను బలుకదు. (అని కేక వేసి) ఈ దురాత్మురాలు నా కమ్మాంసరక్తమేదోవసాది నానా పదార్థములందెచ్చి యీక, యితర వ్యాపారంబు లేవో నిర్వర్తించుచున్నది. దీని నీదినంబున బుద్ధివచ్చినదాఁక చేతుల తీట తీరునట్లు బాదెదను. ఇంకను రాకున్నది. హా! దురాత్మ రాలా! నీ యాయుర్దాయముగూడ నేఁడు మట్టమైనది. నీ యంతం బునకే యీ యాశ్రమోపాంతంబున కా నరాధములు వచ్చిరి. ఈ చండాలురా లింకను రాదు. ఆ! రాక యెచ్చటికిఁ బోవును. ఎక్కడి కరిగినదో! ఇప్పుడు నే నాగుహాంతరంబున కరిగి పండు కొనియెద. ఒక్క ముహూర్తంబుసేపువేచి తదనంతరంబ నేనే పోయెద. (అని వెళ్లుచున్నాఁడు)

(భీముఁడు తక్క తక్కినవారు నిద్రించుచున్నారు)

భీముఁడు: (తనలో) అహో! నాఁడు కృష్ణ చతుర్దశీ నిశాసమయంబున లాక్షా గృహదవానలమహార్ణవంబు విదురకటాక్షతరణయాన పాత్రమూలంబున దాఁటి బైటఁబడి నిరంతర ప్రయాణ పరం పరలఁజేసి బహువిధఘాతుక మృగవ్రాత శరణ్యంబగు నీ మహా రణ్యంబు ప్రవేశించితిమిగదా! అదె స్వకీయ మయూఖరేఖా దుర్గమంబని యెంచి యీ కాంతారంబునఁ జిరకాలనివాసియగు

మహాంధకారమును నిర్మూలనము సలుపలేక లజ్జించి, కోపించి యరుణాననుండై, దినకరుఁడు నిజవాసంబున కేఁగుచున్నాఁడో యన నపరధరాధరేంద్రంబునఁ గ్రుంకుచున్నాఁడు. అష్టదిశల యందును గాఢాంధకారంబు బంధురంబుగా వ్యాపించుచున్నది. నానావిధ శకుంతసంతానంబు లాత్మీయకులాయంబులం బ్రవేశించుచున్నవి. ఆత్మీయ బృంహితానూనధ్వాన బధిరితాశాంతమాతంగకర్ణ కుహరాంతరాళంబులగు శుండాలతండంబులును, గండస్థల స్రవత్ఫేనసందోహసమేతంబులును, దవదహన తేజోదర్శన దూరీకృతంబులునగు భల్లూకనికాయంబులును గలిగి హృదయ ఖేదకరంబగు నీ గహనమున నీయామినీ యామచతుష్టయంబును మాతృ భ్రాతృ సంరక్షణం బేక్రియ నాచరించెదనో తోఁపకున్నది. అయినను శత్రుభయద మహాకారుండను, పాండు నందన వజ్రప్రాకారుండను నగు నేను సజీవుండనై యుండ ఘాతుక మృగవ్రాతంబులుగాని భూత పిశాచంబులుకాని, రాత్రించరాధమ సంతానంబులు కాని మత్సహోదరులఁ దేరియైన నీక్షింపఁజాలవు. అయినను భయము లేదుగాని పుత్రసమేతంబుగా నీ పాంసుపటలధూసరంబైన కటికిజాతినేల నీ కుంతీ మహాదేవి పవళించుట వీక్షింప నా గర్భంబు దహించుకొని పోవుచున్నయది. ఇదియెల్ల నక్కౄరాధమునికారణంబునంగదా! సూతనందన కూర్మకుల శేఖరోద్ధతంబైన గాంధారేయాగ్రజమంధరా హార్య క్షుభ్యమానంబగు భరతవంశక్షీర పారావారంబున పరస్పర నిర్మూలనాఖిల మహావైర హాలాహలంబును, యుధిష్ఠిర ప్రశాంతి సంజనిత విశాలయశోరాకాసుధాకరుండును, గంధవహప్రియనందన పరితాపలక్ష్మియు, సంక్రందననందన ధైర్యకౌస్తుభమాణిక్యతల్ల

తకెక్కువ యగుచున్నది. నేఁబోయి యింటనుండెద. (అనికేక వేసి వెళ్లుచున్నాఁడు) (తిరిగివచ్చి.) ఆకటం గటకట పడుచు నా ప్రాణంబులు దేహంబున నుండకున్నవి. ఓ హిడింబా! రా, వేగముగా! ఆమనుష్యులు నిన్నుఁజూచిన మాత్రమ్మున నెందైన నను దాగిరా యేమి? అట్లయిన నీక్షణంబుననే నేవచ్చి పుర్రిచ్చులంబరి మార్చెదను. ఏమిది? ఎన్ని పిల్చినను బలుకదు. (అని కేక వేసి) ఈ దురాత్మురాలు నా కమ్మాంసరక్తమేదోవసాది నానా పదార్థములందెచ్చి యీక, యితర వ్యాపారంబు లేవో నిర్వర్తించుచున్నది. దీని నీదినంబున బుద్ధివచ్చినదాఁక చేతుల తీట తీరునట్లు బాదెదను. ఇంకను రాకున్నది. హా! దురాత్మురాలా! నీ యాయుర్దాయముగూడ నేఁడు మట్టమైనది. నీ యంతంబునకే యీ యాశ్రమోపాంతంబున కా నరాధములు వచ్చిరి. ఈ చండాలురా లింకను రాదు. ఆ! రాక యెచ్చటికిఁ బోవును. ఎక్కడి కరిగినదో! ఇప్పుడు నే నాగుహాంతరంబున కరిగి పండు కొనియెద. ఒక్క ముహూర్తంబు సేపువేచి తదనంతరంబ నేనే పోయెద. (అని వెళ్లుచున్నాఁడు)

(భీముఁడు తక్క తక్కినవారు నిద్రించుచున్నారు)

భీముఁడు: (తనలో) అహో నాఁడు కృష్ణ చతుర్దశీ నిశాసమయంబున లాక్షా గృహదవానలమహార్ణవంబు విదురకటాక్షతరణియాన పాత్రిమూలంబున దాఁటి బైటఁబడి నిరంతర ప్రయాణ పరంపరలఁజేసి బహువిధఘాతుక మృగవ్రాత శరణ్యంబగు నీ మహారణ్యంబు ప్రవేశించితిమిగదా! అదె స్వకీయ మయూఖరేఖా దుర్గమంబని యెంచి యీ కాంతారంబునఁ జిరకాలనివాసియగు

మహాంధకారమును నిర్మూలనము సలుపలేక లజ్జించి, కోపించి యరుణాననుండై, దినకరుఁడు నిజవాసంబున కేఁగుచున్నాఁడో యన నపరధరాధరేంద్రింబునఁ గ్రుంకుచున్నాఁడు. అష్టదిశల యందును గాఢాంధకారంబు బంధురంబుగా వ్యాపించుచున్నది. నానావిధ శకుంతసంతానంబు లాత్మీయకులాయంబులం బ్రవేశించుచున్నవి. ఆత్మీయ బృంహితానూనధ్వాన బధిరితాశాంతమాతంగకర్ణ కుహరాంతరాళంబులగు శుండాలతండంబులును, గండస్థల స్రవత్స్వేనసందోహసమేతంబులును, దవదహన తేజోదర్శన దూరీకృతంబులునగు భల్లూకనికాయంబులును గలిగి హృదయ ఖేదకరంబగు నీ గహనమున నీయామినీ యామ చతుష్టయంబును మాతృ భ్రాతృ సంరక్షణం బేక్రియ నాచరించెదనో తోఁపకున్నది. అయినను శత్రుభయద మహాకారుండను, పాండు నందన వజ్రప్రాకారుండను నగు నేను సజీవుండనై యుండ ఘాతుక మృగవ్రాతంబులుగాని భూత పిశాచంబులుకాని, రాత్రించరాధమ సంతానంబులు కాని మత్సహోదరులఁ దేరియైన నీక్షింపఁజాలవు. అయినను భయము లేదుగాని పుత్ర సమేతంబుగా నీ పాంసుపటలధూసరంబైన కటికిఱాతినేల నీ కుంతీ మహాదేవి పవళించుట వీక్షింప నా గర్భంబు దహించుకొని పోవుచున్నయది. ఇదియెల్ల నక్రూరవాధమునికారణంబునంగదా! సూతనందన కూర్మకుల శేఖరోద్ధతంబైన గాంధారేయాగ్రజమంధరా హార్య క్షుభ్యమానంబగు భరతవంశక్షీర పారావారంబున పరస్పర నిర్మూలనాఖిల మహావైర హాలాహలంబును, యుధిష్ఠిర ప్రశాంతి సంజనిత విశాలయశోరాకాసుధాకరుండును, గంధవహప్రియనందన పరితాపలక్ష్మియు, సంక్రందననందన ధైర్యకౌస్తుభమాణిక్య తల్ల

జంబును, మాదేశీయ శౌర్యగాంభీర్యైర్యాపతోచ్చైఃశ్రవంబులును, పాండునందన దర్శిత జనానురాగామృతంబును సముత్పన్నంబులగుచున్నవి. ఇదియును నాదురాత్మునిచేతనే కదా! పూర్వ కాలంబున దోషశబ్ద పరిజ్ఞాన విహీనంబై నిష్కళంకంబై, యల రారు మహాభిషభీమసేన ప్రదీపశంతనుల వంశంబు నేఁడీ దురాత్ముని కారణంబున పాపభూయిష్ఠమై పోవుచున్నది. అహాహా! దైవమాయ. దురాత్మా! దుర్యోధనా! భవత్సహోదరాదుల కును నీకును మే మేమి యపరాధంబు గావించితిమిరా! దురాత్ముండు నిర్హేతుకముగానే యపకారం బాచరించును. అతనికిఁ గారణ మెందుకు? నావంటి సోదరుఁడుండియు వీరల కీషణ్మాత్రోప కారంబైనను జేయలేఁడయ్యెను గదా! [అని దుఃఖించుచున్నాఁడు]

హిడింబ: [ప్రవేశించి తనలో] ఈ నరాధముల నిమిషంబునం బరిమార్చి మా సహోదరునకర్పణము గావింపకుండిన నాతం డాగ్రహించెడిని. జాగుచేసినఁ బ్రాణభంగంబు కాఁగలదు. వీరెట్టి బలాఢ్యులో చూచి వీరి వధింపవలెను. ఎంతటివారును బ్రతి పక్ష సామర్థ్యం బెఱుంగక కలహంబునకు డీకొనరాదు గదా! [భీమునిఁజూచి]. ఇమ్మహానుభావుని ముఖారవిందసందర్శన మున నాకోపంబుదీరి స్మరతాపఁ బధికంబుగ వృద్ధియగుచున్నది. [అని చూచును]

భీముఁడు: [కన్నీళ్లతోఁగుంతిని జూచి] అమ్మా! కుంతీదేవీ! భోజరాజ ప్రియతనూజవు. విచిత్ర వీర్య మహారాజు స్నుషవు. పాండు ధరాతలేంద్రుని పట్టమహిషివి. ధైర్యశౌర్యగాంభీర్య చాతుర్య సాగరులగు పాండవులకు జననివి. అట్టి నీ కెట్టి యవస్థ తటస్థమైనది. పాండు క్ష్మాపాలుండు దిగ్విజయంబు

చేయుకాలంబున మాన్యరా జన్య కన్యకావళు లాత్మీయ దాస దాసీ విలాసినీ పరివృతులై, భవత్పాదారవింద పరిచర్యల నొనరించుచుండ మృదుతరహంసతూలికా తల్పంబున శయనించు నీ వీ కఠినపాంసుల స్థలంబున నిద్రాసక్తురాలవై యుండుట చూడ నాకు దుఃఖంబు పొరలి వచ్చుచున్నయది. హాటక హర్మ్య మధ్యంబునఁ బ్రభాకరదర్శనం బెట్టిదియో యెఱుఁగని నీకు మహారణ్యంబులే మందిరంబు లాయెనా! మృదుతరోపధానంబు లుపయోగించు నీకుఁ గైదండయే తలగడ యయ్యెనా! (పాదములపైఁ జేయివేసి, అమ్మా; భవన్నవపల్లవ కోమల చరణ యుగంబు గడుం గందియున్నది. అయ్యో! యెంత కష్టము[అని విలపించుచున్నాఁడు]

హిడింబ: (తనలో) ఇమ్మహాబలురూపంబు చూడఁ గోపంబుదీరిస్మర తాపంబు హెచ్చుచున్నది. ఈతండేమికతంబుననో విలపించుచున్నవాఁడు. వీనియెదుట నీ సమయంబున నిలువరాదు, అదియునుం గాక యీనిశాచరరూపంబున వీనిం జూచిన నన్ను వరింపఁడు. కామరూపధారిణినై వచ్చి యీతని దుఃఖ ముపశమించు నందాఁక నమ్మహామహీరుహంబుచాటున దాఁగియుండెద. [అని కామరూపిణియై వచ్చి నిలఁబడును.]

భీముఁడు: అదియట్లుండఁ బాండురాజాన్వయ రత్నాకరరాకాసుధాకరుండును, సప్తద్వీప విశాలసర్వసర్వంసహాచక్ర పరిపాలనోచిత శుభలక్షణలక్షితుండును, గంధర్వ దర్పపరిహాసిమూర్తియు, సద్గుణస్ఫూర్తియుఁ గౌరవశ్రేష్ఠుఁడును, పాండవజ్యేష్ఠుండును నగు నియ్యుధిష్ఠిరుండిట్టు లుపద్రవంబులం బొందగా విధి యెక్కడ వ్రాసెనోగదా! హా! ప్రచండమార్తాండతేజా! ఆశ్రితకల్ప

భూజా! అఖిలభువనజనకృతపూజా! రాజితపదాంభోజా! యుధిష్ఠిరమహారాజా! పాండురాజతనూజా! ఎంతటి కష్టంబు సంప్రాప్తమైనది! వందిమాగధవైతాళిక బృందంబు లభినందింప విద్వాంసులు తర్కవ్యాకరణాదిచర్చలొనరింప క్వణత్కింకిణీరవంబుల సుందరులు వింజామరలువీవ సింహాసనాసీనులగు మీరు పాంసుల స్థలంబునందు నిద్రించుట నేఁజూడవలసి వచ్చెఁగదా! [అని దుఃఖించును.]

హిడింబ: [తనలో] నేసీసారి నవపల్లవ లావణ్యశరీరంబుతోడను వివిధ చిత్రరత్న స్థగిత భూషణంబులతోడను, కాంచన చేలంబుతోడను, వైమానిక సంపూర్ణ చంద్రానన చందంబునఁజూచిన మాత్రంబున మోహింపఁబడునట్లు కామరూపముతోవచ్చి యుంటినిగదా! ఇమ్మహాత్ముండాజానువాయత బాహుండును కమనీయదేహుండునునయి నా హృదయంబున కత్యధికతాపంబును గల్పించుచున్నాఁడు. అహాహా! యేమి యీతనిలావణ్యంబు.

భీముఁడు: అదియటుండ మృదుమధుర భాషణభూషణుండును, కుంభసంభవాచార్య ప్రియశిష్యుండును, సకల ధనుర్విద్యాపారంగతుఁడును నగు నియ్యర్జునుం డా వాసుదేవునితో నిరంతర సౌఖ్యపదవిందేలుఁగాని శరీరమునకెన్నండును గాసియిడి యెఱుంగఁడు. అట్టి వీని కెట్టి చెట్ట పుట్టెను. హా! సుత్రామపుత్రా! తేజో పరిహసితకంజమిత్రా! భరతకులైకధనుర్ధరా! తమ్ముఁడా! కఠిన పాషాణకల్పితశయ్యాతలంబుననున్న నీకు సాహాయ్యంబు నేఁజాలక బేలలీలనున్న నాకంటె నదృష్టహీనుం డెందుండును?

హిడింబ: [తనలో] ఇమ్మహారాజ కుమారుండు నిజసోదర క్లేశంబునకుఁ బరితపించుచున్నను దద్విలాపప్రలాపంబులు నా శ్రవణ

కలాపంబులుగాఁ దోఁచుచున్నయవి. హా! ఆ మాట మార్దవం బేమని వర్ణింతును. ఆతని దృఢతరసుందరకాయంబేమని శ్లాఘింతును. నా కీతనియందు మనంబు దగిలినది. ఇంకం దిరుగదు. అహాహా! ఎన్నండీతని సంయోగంబు గల్గునో! విధినియోగం బెన్నఁడున్నదో యూనాఁడగును. విచారించిన ఫలములేదు.

భీముఁడు: హా బుధజనవిధేయులారా! ఆహవజితవైరినికాయులారా! వివిధ విద్యాధౌరేయులారా! మాద్రేయులారా! మాతోడంగూడి యిమ్మహాసౌఖ్యంబులం బొందఁ గలరని యుష్మజ్జనని మాయమ్మగారికి నొప్పగించి మేనోసరించెను. ఇదిగదా మీరలు మాతోడంగూడి యనుభవించు సౌఖ్యము. నివాసయోగ్యంబగు గృహంబులేక యరణ్యంబులే శరణ్యంబులుగాఁ దిరుగుచున్న మిమ్ముఁజూచి యె ట్లోర్వఁగలము. హా నకులకుమారా! మారసుకుమారాకారా! భువనైకసుందరా! ఆసమశరుండు నిటలాక్షమహాగ్నిహానల దహ్యమానుండై యనంగుండై, రూపహీనుండగుట కాధాత చింతించి నరులకా పంచశరుంజూపఁదలంచి యాతని నిన్నుగానొనరించి ధరకంపెనని నీ రూపంబుఁజూడ నాకుం దోఁచెడిని. తమ్ముఁడా! నీ సుకుమారాకారంబిమ్మహారణ్యంబులపాలు గావలసిన యోగ్యతయున్నది గాఁ బోలును.

హిడింబ: [తనలో] ఈతనికి జననీసోదరులయం దధికప్రేమగలదు. నాయందుఁగూడ నిట్టి యనురాగంబు గలుగునోలేదోయని హృదయంబు పరితపించుచున్నది.

భీముఁడు: తమ్ముఁడా! సహదేవా! పరితోషితవాసుదేవా! మద్రిరాజకుమారీ రత్నంబును, పాండుధరాకళత్రుండును, ఎంతయు

నదృష్టవంతులని నిశ్చయముగాఁ జెప్పఁగలను. ఏమన, మనమే. పురము నందులో ముఖ్యముగా మీరును, జెందెడు కష్టములు. లేశము నెఱుంగకయే సురలోకప్రాప్తులయిరి. పోవుచు వారి భాగఁబు కష్టంబుగూడ నష్టంబుగాఁ గుంతీయుధిష్ఠిరులననుభ వింపుఁడని యేర్పఱిచిరి. మా కనుంగు సహోదరుండవై, కుంతీ మహాదేవిగారికిఁ గనిష్ఠ పుత్రుండవై యధ్యాత్మ విద్యాధర్మ, మర్మపరిజ్ఞాతవైన నీవీకటికి నేలఁబవ్వళించెడు మహాప్రియా నంబు నేఁజూడఁజాలను. చూడంజాలకున్న తప్పునా. ఏమి చేయఁగలము, అయినను [ధర్మజుని(జూపుచు] ఆరాజశేఖరుండీ రాజశేఖరునిపై కటాక్షింపకుండునా? ఆ సరోజాక్షుండీ సరోజాక్షు నొక్కదరికిందేల్పఁడే! ఆ రమాధవుండీషమాధవునేల బ్రోవకుం డును. ఆహా! దుర్యోధనా! భవదీయ కృతాపకారముననేసుమా మాకీమహోపద్రవములు. వంశోద్ధరణంబున కుద్భవించితివి గావున వంశోద్ధరణ మాచరించుచుంటివి. కానీ! యీరీతిని బహువిధమాయోపాయముల నిర్మించి మమ్ములం బంచత్వంబు నొందింప నెంచితిగా! చూడు. గాంధారీ నందనులీపాండునం దనకోపానల శలభంబులు గాఁగలరు. (అని) మూఢజనసామా న్యంబగు మహాదుఃఖమునొంది మహాగాంభీర్య ధుర్యుండనునేను గూడ వీరపురుషకర్మంబు విడుచుటయేల ఛీ! దుఃఖమెందుకు? (అని లేచినాల్గు మూలలు వెదకును)

హిడింబ: (తనలో) ఇమ్మహారాజకుమారుండు దుఃఖమునుండితొలఁగి ధైర్యం బవలంబించెను. ఇంకనీతనితోనాకు సమాగమంబుకాఁ గలదు. అతనిసన్నిధానంబునకుఁబోయి నిల్చెద. (అనినడచును)

భీముఁడు: అహో! మరణాయాసక్లేశంబున శరీరంబాపాదమస్తకము నొప్పులెత్తుచున్నది. కాయంబునిబిడస్వేద కణపరిపూరితంబై యున్నయది. బుభుక్షాపిపాసాయాసంబు లధికంబులగుచున్నవి. దాహంబుదీర్చుకొనినంగాని దేహంబు నిలుపఁజాలను. కాని యిమ్మహాంధకారంబున నియ్యర్ధరాత్రింబునందీఘోరాటవి యందుదకంబెట్లు సమకూరును. అయినను నాల్గుదెసలఁబరికించెద. (అనిచూచి) అల్లదె చూపుమేర దూరంబున నిర్మలశీతలోదక కమలాకరంబగు నొక్కకమలాకరంబుగన్పట్టుచున్నయది. అహహా! అది యెంతసుందరము. దానింజేరి మదీయదాహశాంతికై తదీయస్వాదుజలాస్వాదన మొనరించికొని వీరలకు నుదకంబుకొంత తెచ్చెద. [పోయి యుదకముత్రాగుట నభినయించుచున్నాఁడు]

హిడింబ: ఈ తండు దాహశాంతిచేసికొనఁదలంచి సరోవరంబున కరిగెనే! మరలునంతనే వానికింగనఁబడి నాహృదయసంతాప మెఱింగించి యెట్లయిన మదీయచతురవాక్యప్రవీణతచే నాతని నా వలలో వేసికొనవలయు. ఏమిచేయుదును. [ఆలోచించి]

[జలపాత్రితో భీముఁడు ప్రవేశించును]

భీముఁడు: అహహా! జలంబుల నుదరంబు నిండఁద్రావివచ్చినాఁడను. వీరికి మదీయనిర్గమానంతరము నిద్రాభంగంబు కలుగలేదు గదా! లేదు, లేదు, అదిగో నిద్రించుచునేయున్నారు. [దిక్కులుచూచి ఆశ్చర్యముతో] ఏమీ యొక్కన్యకామణి యెవ్వరు? నేనుజలాస్వాదనమున కరుగుతఱి కీసరసిజనేత్ర యిచ్చటనున్నదా? లేదు. మత్సహోదరులను గామరూపంబున నెత్తికొని పోవఁదలంచి

వచ్చిన నిశాచరాంగనవలెనున్నది. అదృష్టవంతుఁడనే-వేగంబ వచ్చితిని. అయిననీమె యెవ్వరో తెలిసికొనియెద ఓ కన్యకా ! నీవెవ్వరవు ? వనలక్ష్మివా ? త్రిభువనరాజ్యలక్ష్మివా ? లేక మునికన్యవా? మమ్ముందినఁదలంచి వచ్చిన రాత్రించరాంగనవా ? ఏల యీ యర్ధరాత్రంబున నీ యంధకారంబున మాకడ నిల్చితివి? నీ యుదంతం బాద్యంతంబు నాకుఁ దేటతెల్లంబుచేయుము.

హిడింబ: ఓ రాజేంద్రకుమారా ! ఇమ్మహారణ్యాధినాధుండును సేవితానేకాసురుండును నగు హిడింబాసురు చెలియల.

భీముఁడు: (కొంచెము కోపముతో) అమ్మనుజాశనుండగు నీ సహోదరాధముం దేమయిన మమ్ముఁజేయుమన్ని నిన్నుం బంపెనా యేమి?

హిడింబ: దేవా ! యాగ్రహింపఁబోకుఁడు, నాచరిత్రంబుచెప్పెద. ఆ హిడింబాసురుం డసాధారణబాహుబలుండు. సురాసుర దుర్నిరీక్ష్యతేజుండు. ఆతండు మిమ్మువధియించి తెమ్మనినన్నుఁబంపె. నేనువచ్చితిని. కాని....

భీముఁడు: ఓసీ దురాత్మురాలా ! యుష్మత్సహోదరుం డసాధారణబాహుబలుండా! సురాసుర దుర్నిరీక్ష్యతేజుండా! మమ్ముం జంపి తెమ్మని నిన్ను బంపెనా ! నీవువచ్చితివా ! (నవ్వుచు) ఆహాహా ! నీ సహోదరు బలంబును నీవే కొనియాడవలయును. ఛీ! సిగ్గులేక పేలకుము.

హిడింబి: మహాత్మా ! శాంతింపుడు. కాని..........దేవరరూపలావణ్య సందర్శనమున మారవికారంబుగలుగ నేమియుఁదోఁచకయున్న దానను. పంచబాణుం డఖర్వగర్వబున మౌర్వీనాదంబుసేసి ధనుష్టంకారముగావించి ప్రత్యాలీఢపదారవిందుండై కెవ్వనార్చి,

యపరిమితకుసుమశరంబుల నిసుమువిసరినట్లు విసరుచున్నాఁడు. కావున నా చిన్నవిన్నపంబునుదిన్నగ మన్నించి నన్ను గాంధర్వంబునఁ బాణిగ్రిహణంబు చేయుఁడు.

భీముఁడు: మూఢురాలా! భవత్సహోదర మహాంధకార ప్రచండభానుండనగు నా భీష్మభాషణములువిని ప్రాణరక్షణార్థంబు నన్నుంబరిణయంబగుదుననియు గాంధర్వంబునఁబాణిగ్రిహణం బాచరింపుమనియు మదంబునం బల్కుచుంటివిగా. ఛీ సకలసామ్రిజ్యపరిపాలనోచితుఁడనగు మహారాజకుమారుండను నేనెక్కడ. మనుజభోజనాంగనవగు నీవెక్కడ ? నీకును నాకును వివాహమెక్కడ ! పో! పో! మూర్ఖురాలా! అదియునుంగాక మదగ్రిసోదరుండగు యుధిష్ఠిరున కింకను వివాహ మైయుండలేదు. అగ్రిజన్మునికంటెముందుగ ననుజన్ముండు వివాహమాడుట ధర్మవిరుద్ధంబు.

హిడింబ: మహారాజా! భవత్సహోదరుల ప్రశంస నీకేటికి? వీరల నిమ్మహారణ్యంబున విడనాడి నన్నుం బెండ్లియై నావెంట రమ్ము. బంధుజనంబుల కొఱకై క్లేశమందు జనులకుఁ గామితసౌఖ్యంబు లెత్తెఱుంగునఁగల్గును? కావున వీరల దిగనాడి నావెంట రమ్ము. నేను గామరూపిణినౌట నీమహాగహనమునందు నీకిష్టమగుస్థలంబునకుఁ గొనిపోయెద.

భీముఁడు: (తనలో) ఈదురాత్మురాలు కామాయత్తచిత్తురాలై మాతృభాతృవర్గంబును నిమ్మహాకాంతారంబున విడిచి తనవెంట రమ్మనుచున్నది. కామవ్యథా పరిపీడితలగు కాంతలెందైన నిట్లే గదా! ఆత్మసౌఖ్యలాలసలై కామినులిట్లు పల్కుచుందురు. స్త్రీల

యంగంబులు నవపల్లవ కోమలంబులుగాని యంతరంగంబులు వజ్రకాఠిన్యంబులు. అయిన దీనినిప్పుడు పొఱఁద్రోలెద. (ప్రకాశముగా) ఓసీ! దురాత్మురాలా! కామాంధకారమున నొడలెఱుంగక నీవేమో ప్రేలుచుంటివి. "స్త్రీ బుద్ధిః ప్రళయంకరీ" అను వాక్యానుసారముగా నీ నీచాలోచనము నాలకించి ప్రవర్తించు నెడలఁ బాటిల్లుమోసం బింతింతయని చెప్పనలవికాదు. నీ నిమిత్త మీమాతృదేవతను నీ సహోదరులను నిమ్మహారణ్యంబునందు విడిచి రమ్మని చెప్పెదవా! నీవురాక్షసాంగనవగుటచేత నీసహజ నీచదుష్ప్రలాపంబులు మానవైతివి. అహాహా! స్త్రీ లెంత కఠిన చిత్తలు,

హిడింబ: మహాత్మా! ప్రాణేశ్వరా! ఆగ్రహింపఁబోకుఁడు. మీ సహోదరులను బరిత్యజించి నావెంట నంటివచ్చిన వీరల కొక్కకష్టంబును రాదని స్పష్టంబుగ నుడువఁగలను. నన్నుంగూడివచ్చిన నిన్ని గహనంబునంగల నదీనదంబుల జలకంబులాడి సరోవర తీరంబుల వసియించి సమస్త మంజు నికుంజ పుంజంబుల మధ్య వసియించి, సుందరారామాంతరంబుల విహరించి, నానావిధ లతాంతసంతాన సుగంధం బాఘ్రాణించి. వన్యమధురఫలంబు లాస్వాదించి సుఖించునట్లు చేసెదను.

భీముఁడు: మూర్ఖురాలా! నీవిచ్చు సౌఖ్యముల నేఁ గూడ స్వప్రయోజకత్వంబుననే పొందఁగలను, అదియునుంగాక, నీ నిమిత్త మఖిల బాంధవశ్రేణిని వర్జించివచ్చిన యెడలఁ గొండొక కాలంబుండి నాపై వలపు తీరిన తదనంతరంబ నన్నువిడనాడెదవు. అప్పుడు పూర్వవర్జిత బాంధవశ్రేణి నాకెట్లు లభించును.లోకంబునఁ బితృ వియోగంబున జగంబంధకారబంధురంబగు; సహోదర మరణం

బున దక్షిణబాహుచ్ఛేదనక్లేశంబు కలుగు? భార్యావియోగంబు కలిగిన మరల నింకొకతెను జెట్టపట్టవచ్చును. జననీ జనక సహోదరుల సంపాదించుట దుర్లభంబు. కావున వీరల విడువను. నీ విప్ప్రియోజన ప్రలాపంబు లింకమాని నీమార్గంబునంబొమ్ము. కాకున్న నీపాట్లు నీవ యెఱుంగఁగలవు. ఛీ! ఛీ! పోపొమ్ము.

హిడింబ: (తనలో) ఎన్నివిధంబుల వీనిం బ్రేరేపించినను ధృఢమన స్కుండై యున్నవాఁడు. వీనివి భయపెట్టి చూచెదను (ప్రకాశ ముగా) అయ్యా! భవద్దీనదశంజూచిన నాహృదయంబు చలించు చున్నది. నాసహోదరుండు సురాసుర యక్షరక్షోనాధ దుర్నిరీ క్ష్యుండు. ఆతండు విశేషంబున మిమ్ముఁ జంపఁగలండు. అది గాక యింత మసలుట కలిగి నన్నుఁగూడ వధించును. కావున నిజప్రాణ రక్షణాభిలాషివై యైన నన్నుం బరిణయంబు గమ్ము. ఎంత యాప్తుఁడైనను స్వప్రాణంబులకంటెనధికుండు గాదుగదా!

భీముఁడు: (కోపముతో) ఓసీ! చండాలురాలా! నీకెన్నిభంగుల బుద్ధి చెప్పినను విననుగా. నీ సహోదరాధమ ప్రతాపంబు లనుక్షణంబు శ్లాఘించుటచే నాహృదయకలంకము తలఁగదు. నేను నిన్నుం బాణిగ్రహణంబు చేయను. సహోదర జననీ రక్షణంబుకంటె నాత్మరక్షణం బధికంబు గాదు. వారే దెసఁబోయిన నేనల్లె యరిగెద. ఆబాల్య వర్ధిత స్నేహులైన మా సహో దరులకంటె నీ వధికురాలవా!

హిడింబ: మహాత్మా నామెఱుంగు తెఱంగు మఱుంగులేక యెఱింగించి తిని. ఇంక దేవరయిష్టంబు, నాభాగ్యంబు.

(తెరలోఁగలకలము)

హిడింబుఁడు: ఆహా దురాత్మురాలా! హిడింబా! ఆ మనుజాధములతో గూడ నిన్నుఁ దప్పక తుదముట్టించెద. హా దురాత్మురాలా! చచ్చితివి. ఇదిగో (అని ప్రవేశించుచున్నాఁడు)

హిడింబ: (భయముతో) మహాత్మా! శరణాగత రక్షకా! రక్షింపుము. మత్సహోదరుండు నన్ను వధియింప వచ్చుచున్నాఁడు.

భీముఁడు: (కోపముతో) ఆదురాత్ముని మదీయ దుర్వార బాహాదండవిచలిత గదాదండ ఘాతంబునం బరిమార్చి, కంఠకావరముమాన్పి, దండధరుమందిరంబున కతిథిం గావించెద. అబలా! నీ కభయ ప్రదానం బొసంగితిని. భయములేదు. నాయండ నుండుము. ఏఁడీ? ఆ దురాత్ముండు రాఁడేమి? (అని దిక్కులు చూచుచున్నాఁడు)

హిడింబ: (భయముతో) అయ్యో! మదగ్రజుం డంతకాల రౌద్రాకారంబున నన్నును వీరలను దునుమ వచ్చుచున్నాఁడు. అయ్యో! ఏల యీతని యాజ్ఞ తీర్పనైతిని ఈ నరు నేల మోహించితిని. ఈ నరుండాతని గెల్చునేని సరే లేకున్న మోసంబగు. అయ్యో! దైవమా! (విలపించుచున్నది)

హిడింబుఁడు: ఓరోరి నరాధములారా: ఓసీ దురాత్మురాలా! అతి శీఘ్ర కాలంబున మీరు నాచే మడియఁగలరు. ఎక్కడున్నారు? [అని వచ్చి] అందఱికంటె ముందు భ్రాతృద్రోహము గావించిన యీ హిడింబను బరిమార్చెద. [మీఁదికి వచ్చుచున్నాఁడు]

భీముఁడు: [తనలో] కాలజీమూతవ్రాతనీలకాయుండై మహామేరుహేమాచల గుహాప్రతిమాన వక్త్రంబుతెఱచి యీతఁ డంజన ధరాధరేం

వస్త్రంబు చందంబునవచ్చు చున్నాఁడు. అగ్నికణంబులట్లు వీని నేత్రంబు లరుణంబులుగనున్నవి. వాని వెస భయమేమి? రానిమ్ము.

హిడింబుఁడు: ఓరోరీ నరాధమా! మహాబలవంతుఁడనని గర్వముతో నొడలెఱుంగక మదీయ వనంబునకు బంధుజనంబులతో వచ్చియుంటివి. నీయాయువు చెల్లినది. నిర్జరులైన నాతోఁ గయ్యమువర్జింతురు. దుర్బలుండవు నీవెంత. అదిగాక నాచెల్లెలిని రక్షింపదక్షుండవని యెంచి దానిం జేరఁదీసితివిగా. రారమ్ము. నిన్నును దానినిగూడఁ బిండిచేసెదను.

భీముఁడు: [కోపముతో] ఓరోరీ! దుర్మదాంధ! భవద్గర్వాపహరణం బొనరించు మహాబల నందనుం డిచ్చట నున్నవాఁడు. అంతకాంతకాంతకు లంతరాయము గల్పింపఁదలంచి వచ్చినను నీ యంతంబుఁజూచెదను. [తనలో] మత్సహోదరులు మా ప్రహరణధ్వానంబులువిని మేల్కొనఁగలరు అందుచే వీనిని దవ్వుగాఁగొని పోయెదను.

[అప్పుడు కుంతి, ధర్మజ, అర్జున, నకుల, సహదేవులు, హిడింబ ప్రవేశించుచున్నారు]

ధర్మ: తమ్ములారా! ఇమ్మహా నిశాచర వృకోదరుల యన్యోన్య ప్రహరణంబుల ధ్వానంబులు మనకు నిద్రాభంగంబు గావించినవి. వీరలిచ్చోట యుద్ధము చేయుచున్నవార్త యా రక్కసి చెప్పినది. అదిగో యిద్దరును యుద్ధము చేయుచున్నారు.

అర్జు: అది సత్యమే. [భీమునిఁజూచి] అన్నయ్యా! యీ రాత్రించరాధమునతి త్వరితంబుగ వధియింపుము. నేనుగూడ వచ్చి తోడ్పడుదునా?

భీముఁడు: తమ్ముఁడా! బలహీనుఁడగు నిద్దురాత్మునిఁ బంచత్వంబు నొం దించుటకు భవత్సాహాయ్యమేల. పరమపాతకుఁడగు నిద్దురాత్ముండు బుద్ధిజాడ్యజనితోన్మాదుఁడై యిమ్మహాగహనము ప్రవేశించిన యదృష్టహీనులగు పాంథజనంబులం బరిమార్చి భక్షించి మత్తిల్లి యున్నాఁడు. నేఁడువీని మదము సదమదము గావించెద. ఉండుము.

హిడింబుడు: ఓరీ! నరాధమా! నన్నుంబరిమార్చువాఁడవు నీవా!

[యుద్ధముచేసి హిడింబుఁడు పడిపోవును.]

భీముఁడు: అమ్మా! కుంతీ! అన్నయ్యా! శత్రుసంహారణ కృతకృత్యుండగు భీమసేనుండు నమస్కరించెదను.

కుంతి: కుమారా! దీర్ఘాయుష్మంతుఁడవు గమ్ము! భవద్దుర్వార ప్రతాపాటోపానలంబునకీ హిడింబుండే ప్రథమ శలభంబు.

ధర్మ: తమ్ముఁడా! చిరంజీవివిగమ్ము! నీ అరిసంహరణ నాటకంబునకిదే నాంది. ఈరీతినే పాండవేయసింహులఁ బరిమార్పఁదలంచి వచ్చెడు శత్రురాజరాక్షసమదేభవర్గంబులు నీచేఁ జచ్చునుగాక.

అర్జు: [తనలో] ఇమ్మహాదైత్యుని వధియింప నేరి శక్యము. మత్సహోదరు బాహాటోపము శ్లాఘనీయము.

ధర్మ: తమ్ములారా! వారణావత పురవాసము చేసి లాక్షా గృహదహనమున బ్రతికి యివ్వనంబుఁజొచ్చి హిడింబాసురశత్రుచ్ఛేదనము గావించినారముగదా! ఇంక నెందైనను నొకజనపదంబుననో, నగరంబుననో నివసింతము. కావున నిమ్మహాకాంతారము విడిచి పోదము రండు.

అందఱు: అట్లాచరించుట యావశ్యకము. (అని పోవుచున్నారు.)

హిడింబ: (వారివెనుకఁబోవుచు) ఈతనిపై వలపున నా సహోదరుఁజాసి కఠినచిత్తురాలనై యుంటిని. ఈతఁడు నన్నుఁబరిణయంబగునో కాఁడోగదా! అయినను వీరలవెంటఁ జనియెద.

భీముఁడు: (కోపముతో) ఓమూఢురాలా! ఇంకను మమ్మనుసరించి యిటురాఁగతంబేమి? ఇంక వచ్చినచో నీ సహోదరు దెసకు నీవు నుం బోఁగలవు. పో, పో, దురాత్మురాలా!

హిడింబ: (కదలక నిలఁబడును.)

భీముఁడు: ఏమీ, మూఢచిత్తురాలా! నిన్నంతంబునొందించెద, చూడుము. (అని మీఁదికి బోఁబోవుచున్నాఁడు.)

ధర్మ: (పట్టుకొని) ఈ మహాగ్రహమునకుఁ గారణమేమి? వధార్హుం డగు దురాత్ముండు వధియింపఁబడెనుగదా! ఇదియబల, వధకన ర్హురాలు. దీనిపై నాగ్రహింపఁబోకుము.

భీముఁడు: (కోపముతో) అన్నయ్యా! ఇద్దురాత్మురాలు మనశాత్రవుం డగు హిడింబాసురు చెలియలు. శత్రుశేషము ఋణశేషము గూడదని యార్యులువక్కాణింతురు. భ్రాతృవధవ్యథచే మనకిది కొండొక యపకార మాచరింపఁ గలదు. శత్రునిర్మూలన మాచ రించునపుడు మిత్రుల చందంబుననుండి యసాధారణమైన యప కార మొనరింతురు, అదిగాక యిది రాక్షసాంగన. కామరూపిణి. దీనిని విశ్వసింపరాదు. మఱియు నిది నన్నుం బరిణయంబు గమ్మని విజ్ఞాపనము చేయుచున్నది. నా కది యసమ్మతము గావున దీని వధి యించుట యుక్తము.

ధర్మ : తమ్ముఁడా ! స్త్రీహత్యయు, గోహత్యయు, బ్రాహ్మణహత్యయు మహాదారుణపాతకంబులు, ఈ ధర్మరహస్యంబెఱిఁగి వర్తింపుము.

హిడింబ: [కుంతియొద్దకుఁబోయి] దేవీ ! నమస్కారము. నా విజ్ఞాపన మొండు గలదు. మన్నించి యాకర్ణింపుము. సకల భూతజాలంబులకు మన్మథవ్యథ సహజంబు. భవత్కుమారరత్నంబగు నిమ్మహాతేజునిపై నాకభిమతంబుగలిగినది. వానిని నన్నుఁ బరిణయంబు గమ్మని బోధంప నా ప్రార్థన. మీఁదఁ దమచిత్తము. నా భాగ్యము.

కుంతి : (ఆలోచించి) కుమారా ! భీమసేనా ! ఈ యంగన రక్షోభామిని యని మనమునఁ జింతింపక వివాహముగమ్ము.

ధర్మ : అమ్మగారి యాజ్ఞానుసారము వర్తించుట మేలు.

హిడిం: అయ్యా ! నేను గామరూపధారిణిని. అగతానాగత వర్తమానంబుల నెఱుంగుదు. సహస్రయోజన దూరమ్మైన నిమేషమాత్రమ్మునఁ బోఁగలదానను. నిర్జరాదులకైన దుర్లభంబగు పదార్థముల నొక్క ముహూర్తమందు సంపాదింప నోపుదును-మీకొక్క తార్కాణం బెఱిఁగింతు. దానంజేసి మన్మహామహిమంబు తేటపడఁగలదు.

ధర్మ : అదియుక్తమే. తక్షణమెఱింగింపుము.

భీముఁడు: రాక్షసస్త్రీల కిట్టి యసాధారణ ప్రజ్ఞలుండుట నే నిదివఱకే యెఱుంగుదు.

హిడిం: మీరంద ఱిచ్చోటనుండి తేజోభాస్వన్మిత్రుండగు శాలిహోత్రునాశ్రమమునఁ బ్రవేశింపఁ గలరు. అందు మానససరోవర ప్రతి

మానసరోవర రాజంబొండుగలదు. తదీయ స్వాదుసలిలాస్వాదనమొనరించు నరులకు బుభుక్షాపిపాసాయాసంబు లేసమయంబునను గలుగవు. ఆ పద్మాకరంబా శాలిహోత్రముని నిర్మితంబు. అదిగాక శ్రీమహాదేవ పాదారాధనపారాయణుండును, నిజతపఃపరితర్పితనారాయణుండు నగు బాదరాయణుండు మీకుం బ్రత్యక్షంబై హితోపదేశ మొనరింపఁ గలఁడు. ఇంతవఱకె తెలింగించితి. మీఁది వృత్తాంతంబు మీకే తేట పడఁగలదు.

అందఱు: [ఆశ్చర్యపడుచున్నారు.]

ధర్మ : ఇది మిక్కిలి యక్కజము.

అర్జు : ఇట్టి చిత్రంబు లెచ్చటను లేవు—

భీముఁడు: మనపని యింతటితో ముగియలేదు. మనము మహారణ్యంబులం దిరుగుటకే జన్మించితిమి గావున నింతకంటె నెక్కుడు చిత్రంబులం జూడఁగలము.

అర్జు : అదియును సత్యమే.

ధర్మ : తమ్ముఁడా ! భీమసేన ! ఉత్తమక్షత్రియప్రవరుండగు మహారాజకుమారునకు నష్టవిధ వివాహములందును గాంధర్వంబు మాననీయము గావున నీ రక్షఃకన్యకను వివాహమాడుము. నా వాక్యముం దీసివేయకుము.

కుంతి : కుమారా ! భీమన్నా ! ఈ యుధిష్ఠిరుండు నిఖిల ధర్మాధర్మవిచక్షణుండు. ధర్మవిరుద్ధంబైన కార్యంబును నీ కాజ్ఞాపింపఁడు గావున నిక్కన్యను నీవు పెండ్లియై పుత్రపౌత్రాభివృద్ధి గాంచుము.

ధర్మ : అమ్మా  అగ్రసహోదర మాతృవాక్య పరిపాలన మొనరింపు
కరుగ  సహోదరుండు సంక్రందననందనుండు ప్రార్థించు
లింక
సౌఖ్య

పౌరవర్తనుండగు నకులుం డీ కార్యంబున దేవర

చం॥ ఒ  చెప్పుటకు క్షమియింపవలె నని ప్రార్థించుచున్నాడు.
న
అ  ! మాయందఱి యభిప్రాయమును, ముఖ్యముగా నీ
  కాభీష్టమునుఁ దీర్చవలయును.

అర్జు
సంచా
వండు  అన్నయ్యా! అగ్రసోదరుండు బ్రహ్మచారియై
  నిష్ఠసోదరుండు వివాహమాడుట ధర్మవిరుద్ధముగాదా!
  లధర్మజ్ఞులయ్యు నిట్లేల వాక్రుచ్చెదరు.

మన్నా! అగ్రజుడాజ్ఞయొసంగినఁ గనిష్ఠుండు వివాహ
ధర్మ : అయ్యె  ). దానం దోషములేదు. కావున వేగమే యామెకోరికఁ
రించు

; ! అగ్రజాజ్ఞానుసారంబుగను, మాతృనియోగ ప్రకా
అర్జు : శస్త్రా  , అనుజ సమ్మతంబుననుఈ కన్యకను బాణిగ్రహణము
  న్నను. (అని చేయిపట్టుకొనును.)

ఘటో : ఓ  పాండురాజాన్వయ ప్రవర్ధనంబునకుఁ ప్రథమకార్యంబు.

ధర్మ : (త  య ! భవదనుజ్ఞా సంపాదిత భార్యాసమేతుండనయి వంద
చున  రించుచున్నాను.

చూ  వా ! (లేవనెత్తి) చిరకాలజీవివై పుత్రపౌత్రదౌహిత్ర
వా  డవయి యఖండైశ్వర్యముతో వర్ధిల్లుము.

భీము : అమ్మా ! నమస్కరించు చున్నాఁడను.

కుంతి : కుమారా ! పాండురాజాన్వయమును, భరతవంశమును వృద్ధిఁ బొందింపుము.

ధర్మ : (తనలో) ఈతం డేతన్నారీలోలుండై యరణ్యంబులఁ దిరుగు చుండిన మన కపాయంబురాఁగలదు. (ప్రకాశముగా) తమ్ముఁడా! నీవీ భామినితో దినంబుల నీ యిచ్చవచ్చిన తెఱంగున విహరించి నిశల మా చెంతకు వచ్చుచుండుము.

భీము : చిత్తము. అమ్మా ! పోయివచ్చెదను. అనుజులారా ! పోయి వచ్చెదను.

కుంతి : శుభమగుఁగాక !

హిడిం : తేజోమార్తాండులగు బావగారి కడను, అనన్య ప్రతాపరాసులగు మఱందులకడను, బరమ గుణరాశియగు నత్తగారికడను ననుజ్ఞ గొని పోయివచ్చెదను,

కుంతి : అమ్మా ! కోడలా ! ఈతండు పతి గావున నత్యధిక వినయ నయ సంభ్రమములతో వర్తిల్లుచుఁ దచ్చిత్తరంజకంబులగు చర్యల నొనరించుచు పతివ్రతవై యుండుము. పోయిరమ్మా. ఈ మాఱు నిన్ను సపుత్రికంబుగాఁ జూతునుగాక !

భీము : (పోవుచు) ప్రియురాలా ! పుత్రసంతానప్రాప్తి యగునందాక నిన్నుంగూడి వర్తించెద. ఏమ్మట మాను నాఁడను. ఇదినీకు సమ్మతమేనా !

హిడిం: అట్లేయొనరింపుఁడు. (ఇద్దరు నిష్క్రమింతురు.)

అర్జు : అన్నయ్యా! అగ్రిసహోదర మాతృవాక్య పరిపాలన మొనరింపు. డని ప్రియసహోదరుండు సంక్రందననందనుండు ప్రార్థించు చున్నాఁడు.

నకు : భవదాజ్ఞానుసారవర్తనుండగు నకులుం డీ కార్యంబున దేవర కాలోచనము చెప్పుటకు క్షమియింపవలె నని ప్రార్థించుచున్నాఁడు.

సహ : అన్నయ్యా ! మాయందఱి యభిప్రాయమును, ముఖ్యముగా నీ మాతృదేవతాభీష్టమునుఁ దీర్చవలయును.

భీముఁడు: అమ్మా ! అన్నయ్యా ! అగ్రిసోదరుండు బ్రహ్మచారియై యుండఁ గనిష్ఠసోదరుండు వివాహమాడుట ధర్మవిరుద్ధముగాదా! తమరు సకలధర్మజ్ఞులయ్యు నిట్లేల వాక్రుచ్చెదరు.

ధర్మ : అవును. భీమన్నా ! అగ్రిజుఁడాజ్ఞయొసంగినఁ గనిష్ఠుండు వివాహ మాడందగు. దానం దోషములేదు. కావున వేగమే యామెకోరికఁ దీర్పుము.

భీమ : అన్నయ్యా ! అగ్రిజాజ్ఞానుసారంబుగను, మాతృనియోగ ప్రకారంబుగను, అనుజ సమ్మతంబునను, ఈ కన్యకను బాణిగ్రహణము చేయుచున్నాను. (అని చేయిపట్టుకొనును.)

ధర్మ : ఇదియే పాండురాజాన్వయ ప్రవర్ధనంబునకుఁ బ్రథమకార్యంబు.

భీము : అన్నయ్యా ! భవదనుజ్ఞా సంపాదిత భార్యాసమేతుండనయి వందనం బొనరించుచున్నాను.

ధర్మ : తమ్ముఁడా ! (లేవనెత్తి) చిరకాలజీవివై పుత్రపౌత్రదౌహిత్ర సమేతుండవయి యఖండైశ్వర్యముతో వర్ధిల్లుము.

భీము : అమ్మా ! నమస్కరించుచున్నాఁడను.

కుంతి : కుమారా ! పాండురాజాన్వయమును, భరతవంశమును వృద్ధిఁ బొందింపుము.

ధర్మ : (తనలో) ఈతం డేతన్నారీలోలుండై యరణ్యంబులఁ దిరుగుచుండిన మన కపాయంబురాఁగలదు. (ప్రకాశముగా) తమ్ముఁడా! నీవీ భామినితో దినంబుల నీ యిచ్చవచ్చిన తెఱంగున విహరించి నిశల మా చెంతకు వచ్చుచుండుము.

భీము : చిత్తము. అమ్మా ! పోయివచ్చెదను. అనుజులారా ! పోయి వచ్చెదను.

కుంతి : శుభమగుఁగాక !

హిడిం : తేజోమూర్తాండులగు బావగారి కడను, అనన్య ప్రతాపరాసులగు మఱందులకడను, పరమ గుణరాశియగు నత్తగారికడను ననుజ్ఞ గొని పోయివచ్చెదను,

కుంతి : అమ్మా ! కోడలా ! ఈతండు పతి గావున నత్యధిక వినయ నయ సంభ్రమములతో వర్తిల్లుచుఁ దచ్చిత్తరంజకంబులగు చర్యల నొనరించుచు పతివ్రతవై యుండుము. పోయిరమ్ము. ఈ మాఱు నిన్ను సపుత్రికంబుగాఁ జూతునుగాక !

భీము : (పోవుచు) ప్రియురాలా ! పుత్రసంతానప్రాప్తి యగునందాక నిన్నుంగూడి వర్తించెద. పిమ్మట మానుకొందును. ఇదినీకు సమ్మతమేనా !

హిడిం: అట్లేయొనరింపుఁడు. (ఇద్దరు నిష్క్రమింతురు.)

ధర్మ : అమ్మా ! మనమింక నిచ్చోట నిలువఁ దగదు. వేఱొండు స్థలమున కరుగవలయు. తమ్ములారా ! రండు పోదము. మనకష్టము లింక వేగమె తీఱఁ గలవని నాకు శుభశకునము లగుచున్నవి. కష్ట సౌఖ్యములు రెండును శాశ్వతములు గావు.

చం॥ ఒకయెడఁగాననంబున మహోగ్రదవానలకాంతి యుండఁగా
నొక యెడ నంధకారమది యుగ్రతరంబుగ వ్యాప్తమయ్యెడున్
అకట ! శరీరమందు సుఖ మంతరితంబయి యుండ నింక వే
ఱొక విషయార్థియై వ్యధల నొందుచు దేహి నటించుకైవడిన్.

అట్లే మన భీమసేనకుమార వివాహానంచమును మహారణ్య సంచార విచారమును మనమునకు బాధసేయుచున్నవి. పోదము రండు.

(తెరలోఁ గలకలము)

ధర్మ : అయ్యో ! మన భీమసేనకుమారుఁడు లేకపోయెనుగదా ! (విచారించును.)

(అందఱు భయముతోఁ జూచుచున్నారు.)

అర్జు : శస్త్రాస్త్రధనుర్ధరుండగు నర్జునుండుండ భయమేటికి?

(భీమసేన, ఘటోత్కచులు ప్రవేశింతురు)

ఘటో : ఓహో ! తండ్రులారా నమస్కారములు.

ధర్మ : (తనలో) ఈతండు నిశాచరుండయ్యు తండ్రులారా ! యను చున్నవాఁడు. ఎవ్వరో చెప్పుమా ! రూపరేఖావిలాసంబులం బోల్చి చూడ భీమసేనునట్లున్నవాఁడు. హిడింబ యట్లు కూడ నున్న వాఁడు.

భీము : అన్నయ్యా ! పెఱువకుఁడు. ఈతండు దుష్టరాక్షసుండు గాఁడు. మత్పుత్రుండు ఘటోత్కచుండు.

ధర్మ ; తమ్ముఁడా ! వీఁడొక్క దుష్టనిశాచరుఁడని భావించి భయపడితిమి. ఈతఁడు మన కుమారుఁడా !

ఘటో : తండ్రులారా ! నేను మీ కుమారుండను. నేను మీ కడనున్న నా కాహార విహారంబులు చాలవు. మహారణ్యంబులందిరుగుచు, మీపనంబున నన్నుం దలంచుకొన్నమాత్రంబున వచ్చువాఁడను. నాయవసరం బగుడు నన్నుఁ దలంచుకొండు. సకల కార్యసాధన మొక్కముహూర్తంబున నిర్వర్తించెద. నేఁ బోయివచ్చెదను.

అందఱు : మంచిది. (ఘటోత్కచుఁడు నిష్క్రమించును)

భీము : అన్నయ్యా ! ఈతండు నాకును, హిడింబకును సద్యోగర్భంబున జనియించిన పుత్రుండు. అపారబలుండు.

ధర్మ : తమ్ముఁడా ! ఆనందజనకమైన వార్తవింటిని.

అర్జు : అన్నయ్యా ! ఇంక మనమీయరణ్యంబున నిలువఁ దగదు. వేఱొండు చోటికిఁ బోదము.

ధర్మ : అవును. వేగమే పోవుదము. (కొంతదూరము నడచి)

అర్జు : మహారణ్యము గడచినట్లు తోఁచుచున్నది.

కుంతి : అవును. నా పాదములందుఁ గంటకాదు లంతగా దిగుటలేదు. ఇది యరణ్యాంతభాగమని తోఁచుచున్నది.

సహ : అవును. ఘాతుకమృగవ్రాతముల కూఁత లంతగా వినఁబడు చుండుటలేదు. నాకును నట్లే తోఁచుచున్నది.

ధర్మ: అవును. ఇది యరణ్యాంతభాగము. అదిగో మహాశ్రమం బొక్కటి కనఁబడుచున్నది. ఇది యెవ్వరిదై యుండవచ్చును? (ఆలోచించి) ఆ! స్ఫురణకు వచ్చినది.

చం॥ పరమపవిత్రుఁడున్ విమలపావక దివ్యచరిత్రుఁడున్ మహా
దురితలతాలవిత్రుఁడును, దుర్గుణకానన వీతిహోత్రుఁడున్
స్ఫురదురుకాంతిమిత్రుఁడును, శోభితగాత్రుఁడునైనయట్టి యా
వరముని శాలిహోత్రుఁడు నివాసముచేసెడు నాశ్రమంబగున్॥

భీము: అన్నయ్యా! మున్ను హిడింబ వచించిన తెఱంగున నియ్యాశ్రమంబునకే వచ్చినారము. దానిమాట సత్యమే.

ధర్మ: తమ్ములారా! మనమయ్యాశ్రమంబునఁజొత్తము రండు. [అందఱును ఆశ్రమము ప్రవేశించి] ఆహాహా! తమ్ములారా! ఈ యాశ్రమరమణీయతఁజూడ నిందే వసింప మనసగుచున్నది. ఆహాహా! ఏమి యీ మునిపల్లభుని తపోమహత్త్వము.

ఉ॥ శారికసంతతుల్ నిలుచు సర్పఫణంబుల ఛాయలందునన్
జేరి మయూరపింఛముల నీడలవాసము చేయుసర్పముల్
కీరములున్ బిడాలములు కేళియొనర్చెడి నెయ్యమొప్పఁగన్
వారణసింహముల్ సహజవైరమువీడి చరించునిచ్చటన్॥

చం॥ నిరతము మౌనివర్యు లతినిష్ఠ నొనర్చెడు నధ్వరంబులన్
దొరకొను నాజ్యహోమముల ధూమము లంబరమార్గమూని పై
నరుగుచునుండె నాకమున కల్లదె హవ్యపదార్థముల్ గొనన్
సరగున రండటంచుఁ ద్రిదశప్రభుముఖ్యులఁ బిల్వనోయనన్॥

అహాహా! కురంగ శాబకంబులు తురంగలించుచు మంజునికుంజ పుంజాంతరంబుల నల్లనల్లన దాగుడుమూఁత లాడుచున్నవి.

అదియునుగాక వాయువులు చంపకమల్లికాది నానావిధసూనవితా
నంబులపైనుండి సుగంధదాయకములై వీచుచుండుట చూచితివా!
మహీరుహంబు లాఋఋతువుల ఫలకుసుమంబులతోఁ గూడినవై
యెట్లు నేత్రింబుల కపూర్వపర్వంబొనర్చుచున్నవో.

అర్జు: అన్నయ్యా! యియ్యాశ్రమ రమణీయతఁ జెప్పనలవికాదు గాని
మార్గాయాసమున నలసి తూలిపడుచున్న వీరల కించుక
జల మిడవలయును. కావున సరోవరమున్న యెడకుఁ బోవుదము
రండు.

ధర్మ: తమ్ముఁడా! మునిపుంగవు ననుజ్ఞలేక సరోవరము ముట్టరాదు.
ఆ త్రిదండి దర్శనముచేయుదము రండు. అదిగో! మహాతపం
బొనరించుచు శాలిహోత్రుండు శిష్య సంఘముతో నాదెస నున్న
వాఁడు. అచ్చటి కేఁగుదము రండు. (అనిపోయి) మునీంద్రా
అనుజసమేతంబుగా నమస్కరించుచున్నాఁడను.

శాలి: ఈప్సితార్థసిద్ధిరస్తు! ఓయీ! నీవెవ్వండవు?

ధర్మ: మహాత్మా!

ఉ॥ భారతవంశ జాతుఁడను పాండునృపాల సుతాగ్రజన్ముఁడన్
పేరు యుధిష్ఠిరుం డనఁగ వెల్లడియయ్యె జగంబులందునన్
వీరలు మత్సహోదరులు పేరిమి నీయమ మాతమాకు దు
ర్వారతపోధనుండగు ననవ్యాసుఁడు మాకుఁ బితామహుండగున్॥

శాలి: అట్టిమహారాజపుత్రులు మహారణ్యంబులఁ దిరుగుటకుఁగారణ
మేమి? అతివేగంబున నుడువుఁడు.

ధర్మ: మహాత్మా! దాయాదులచేవంచింపఁబడి మహారణ్యంబులే శరణ్యంబులుగా నుంటిమి. జనక విహీనులమగు మాపై కటాక్ష నిరీక్షణంబులంబఱపి రక్షింపుఁడు.

(వేదవ్యాసుఁడు ప్రవేశించును)

ధర్మ: అహో! ఘనాఘనశ్యామల శరీరంబుతోడను, దండకమండలువులతోడను ఘనజటాజూటములతోడను రెండవ ధూర్జటి విధంబున నదె నిజారాధనపరితర్పితనారాయణుండగు కృష్ణద్వైపాయనుండు మనలఁ గటాక్షింప వచ్చియున్నవాఁడు. తమ్ములారా! పోయి నమస్కరింతము.

అందఱు: చిత్తము.

ధర్మ: మహానుభావా! శ్రీకృష్ణ ద్వైపాయనా! నమస్కారము.

ఉ॥ శ్రీయుతమూర్తి! దివ్యమునిసేవిత చారుపదాంబుజాత! శా
పాయుధనాథ! భారతమహాన్వయవర్ధన! వేదవేద్య! యా
మ్నాయ విభాగమున్ సలిపి మానవలోకము నుద్ధరించు ద్వై
పాయన! నీమహామహిమ వర్ణన సేయఁదరంబె మాకిలన్॥

వ్యాస: కుమారులారా!

ధర్మ: మహాత్మా!

చం॥ జనకుఁడు దీఱెమాకకట శైశవమందున దిక్కులేదిఁకన్
ఘనులముగాము, బాలురము, కౌరవనాథుఁడు మమ్ముఁజంపగాఁ
దనయునితోడఁగూడె, నిఁకదాము కటాక్షనిరీక్షణంబులన్
గనుఁగొని. చేర్చియొక్కదరి, కావుఁడు కౌరవవంశవర్ధనా॥

వ్యాస: ఆ! కుమారులారా! ఏలయిట్లు కడుపు వగుల దుఃఖించెదరు.. దురాత్ములగు కౌరవాధములు మీయెడ మహాపరాధంబు గావించి రని తపోమహత్త్వంబున నాత్మనెఱింగి యరుగుదెంచితిని. ఆ పాపకర్ములగు కౌరవాధములు తమ దుర్నయంబు ఫలంబును వేగమె భుజింపఁగలరు. మీరీ శాలిహోత్రమునివల్లభు నాశ్రమనంబుఁ గొండొక కాలంబుండి యనంతర మేకచక్రపురమను భూసురాగ్రహారమున మాతృసమేతులరై భూసురవేషంబున నుండుఁడు. తదనంతరంబు లగ్గుకాఁగలదు. మదీయవాక్యంబు మనంబున విశ్వసించిచెప్పినట్లు వర్తింపుఁడు. శుభము కాఁగలదు. అమ్మా! కుంతీ! నీవుండికూడ కుమారుల నిట్లు వాపోవనిచ్చెద వేమి? వారల నూరార్చుము, (తనలో) ఆమెయు స్త్రీ గదా! ఆమె నూరార్చుటకు వేఱొకరుకావలయును. (ప్రకాశముగా) నేఁబోయివచ్చెద. శాలిహోత్రి మునీంద్రా! యీ కుమారులు నీ యాశ్రమంబున నున్నంతకాలము నాకు మాఱుగాఁ జూచుకొను చుండవలయు.

శాలి: చిత్తము.

ధర్మ: మునీంద్రా! నమస్కారము.

వ్యాస: ఈప్సితార్థ సిద్ధిరస్తు! (అని నిష్క్రమించును)

ధర్మ: శాలిహోత్రమునీంద్రా! దాహము పెల్లుగ నగుచున్నది. మాకించుక జలంబు లనుగ్రహింపవలయును.

శాలి: కుమారులారా! ఇయ్యాశ్రమంబుననొక్క సరోవరంబుగలదు. అందలి జలంబులు ద్రావిన నాఁకలియు దప్పియు నుండవు. అందలి స్వాదుజలపానము కావింపుఁడు. వ్యాసవచన ప్రకారము

మీరు నాయాశ్రమంబున నుండుఁడు. తదనంతర మేకచక్ర పురంబున కరుగుఁడు.

ధర్మ: మునీంద్రా! అట్లయిన జననీ సోదరులతో నాసరోవర జలంబుఁ ద్రావి యిచ్చోట నుండెదము.

శాలి: అవును. అట్లులే పొండు. దాహముత్రాగి యించుక సేపు మహీరుహచ్ఛాయ శయనింపుఁడు. మాకును తపోనిష్ఠనుండెడుకాలమయినది. (అని వెడలును)

(అందఱును నిష్క్రమింతురు)

ద్వితీయాంకము సంపూర్ణము.

---

## తృతీయాంకము

### *1 వ రంగము*

ప్రదేశము: ఏకచక్రపురమునందలి విప్రగృహము.

(బ్రాహ్మణుఁడు, శిష్యులు ప్రవేశింతురు.)

బ్రాహ్మ: అవును మీరుచెప్పినట్లు సామోద్గానము మిగులశ్రవణానందకరంబే. అది మముబోటి ఘనాంతస్వాధ్యాయ పరులు పఠించిన యెడల వినువారలమందకుతూహలము పొందఁగలరు. అయినను గానవిద్యకేమి? ఋగ్యజుర్వేదంబులు రెండును పదక్రమ జటాఘనాంతములవఱకును బఠింపుఁడు. ఓరీ సోమశర్మా! నీ

వెక్కడరా చదువవలసినది ? ఓరీ నారాయణభట్టా ! ఓరీ శంకరా ! ఓరీ హరిశర్మా ! మీమీపనసలనారంభించి వేగముగా నాలుగు సంతలు చెప్పుడు. అవలఁ బనియున్నది. ఈ పురమున రాజగృహంబున రాజుగారితండ్రి సాంవత్సరికము. అచ్చటికి రమ్మని పిల్చిరి. పోదము త్వరగాఁగానిండు.

సోమ: అయ్యా ! మూఁడుదినములనుండియు అనధ్యయనము కాఁబట్టి మును పు మీరు చెప్పినదంతయు నీ మూఁడుదినములలోపల మఱచితిని.

హరి: ఓరీ ! మూఁడుదినము లనధ్యయనము వచ్చినదా !

సోమ: ఏమి ? నేనబద్ధము చెప్పినానుకాఁబోలును, ఆటుమొన్న చతుర్దశీ దినము. మాసశివరాత్రి. మొన్న అమావాస్య, నిన్న పాడ్యమి యగుటచేత మానితిని.

హరి: అవును. అవును, నిజమే !

బ్రహ్మ: ఓరీ ! మూర్ఖుఁడా ! అనధ్యయనపు దినమున కొత్తపనసలు వల్లించుటకూడదుగాని పాఠఁతవి చింతనచేయుటకేమిరా ! నీకు వంక దొరకినఁజాలును. ఓరీ ! హరిశర్మా ! నీ వెక్కడఁబనస వల్లించుచుంటివిరా! వేగముగాఁజెప్పుము.

హరి: అయ్యా ! అసలునేను నారాయణోపనిషత్తు చదువుచున్నాను. కాని సోమశర్మకు మూఁడుదినము లనధ్యయనము వచ్చినదేకాని నాకొకదినము లనధ్యయనమువచ్చినది.

సోమ: ఓరీ ! నన్నింద్వాఁక మూఁడుదినములువచ్చినవాయని యాక్షేపించి తివిగాదురా ! ఇపుడునీకొకరోజులు వచ్చినవిగా ! నాకంటె రెండాకు లెక్కువ చదువుకొంటివిగాఁబోలును.

బ్రాహ్మ: ఆయురోజు లెక్కడివిరా!

హరి: అయ్యా! చెప్పెదనువినుండు. సోమశర్మ మూఁడురోజులకు లెక్క చెప్పెనుగదా! అంతకుఁగ్రితము నందొక నాడుటిమి వది. ఆరోజుచదువులేదుగదా! అంతకుఁబూర్వదినంబు బంధువులు వచ్చినారుగదా! అవిరెండు ననధ్యయనపురోజులుగదా! ఇంకొకటియేదోయున్నది. జ్ఞాపకమువచ్చుటలేదు.

బ్రాహ్మ: ఇంక నీచండాలురకు స్వాధ్యాయమురాదు. వీరలను మాయింటి నుండి లేవఁగొట్టెదను. ఓరీ! సోమశర్మా! యీదినముననైన సంత నారంభింపుమురా. త్వరగానారంభింపుము. ఇదివఱకు నీకేమి వచ్చినది?

సోమ: ఇదివఱకు నాకింటియొద్ద నమకము, చమకము, శ్రీసూక్తము, పురుషసూక్తము, అన్నసూక్తము, దశ్శాంతులునైనవి—ఇక్కడ శ్రౌతము, అశ్వమేధాంతము పఠకుఁజదువ వలెనని వచ్చితిని. కాని మీరు స్మార్తము ముం దారంభింపు మనుచున్నారు. అది రాలేదు. అందుచే నిప్పుడు వేదమైదవ యష్టక ముపక్రమించి నాను. మీరు చెప్పుటచేకాని నాకుతెలియునట్లుచెప్పరు. అడిగిన దర్భాసనపుద్రాడు తీసికొనివెన్ను బద్దలు కొట్టుదురు, ఏమియు రాదు నాకు. అబ్బా చదువు కాదుగాని మరణమువచ్చినది.

బ్రాహ్మ: ఈసోదె యంతయు నెవ్వరు చెప్పుమనిరి. నీవు చెప్పినమాట చూడఁగా నీకేమియు రాదని యర్థమైనది. ఇన్నాళ్లనుండి చదివి యేమియు రాదని యేడ్చెదవేమిరా! భార్య రజస్వలయై నాల్గు సంవత్సరములైనది. పుట్టినింటనున్నది. విద్యార్థివై వచ్చి నీవి

చ్చుచునుంటివి. నీకేమియుపయోగమురా! (అని దర్భాసనపుఁ దార్పిడుతీయును).

సోమ: చదివెదనండి.

బ్రాహ్మ: ఇంకెప్పుడు? మఱియిప్పటికి ముప్పదిమూఁడు సంవత్సరములు వచ్చినవి, సరే, దానికేమిగాని, యీదినముదయమున నా పన్న మెందుకుఁజదువలేదు.

సోమ: ఈ దినము గుర్వాణిగారు స్నానముచేసినదినము. ఇల్లువాకిలి అలికి పిల్లవాండ్రికన్నముపెట్టి అంట్లుతోము నప్పటికీవేళయైనది. ఈ మూఁడుదినములనుండియు నాపని యింతే. శుశ్రూషావేదాధ్యయనము కాదు గాని అడ్డమైనచాకిరి చేయుచున్నాను.

బ్రాహ్మ: (తనలో) అపని బాగుగానేయున్నది. (ప్ర. గా) అట్లయిన నిప్పుడారంభించు. చెప్పెదను.

సోమ: నేను వారముచెప్పిరాలేదు. పొద్దుటినుండి పనితోఁదెమలక యుండుటచే మఱచితిని. ఇప్పుడునేను బోవలయును. (లేచిపోవును)

బ్రాహ్మ: సరే. అట్లయిన నేడు పో.

సోమ: ఏడ్చుచునేయున్నాను..ఏడువక మఱేమున్నది. (వెళ్లును)

బ్రాహ్మ: హరిశర్మా! నీవు చదువురా! నీవు, చదువుకాదుగాని నాయెముకలు కటకట కొఱుకుచున్నావు. చదువు. సంతఆరంభించు. వచ్చినదాకఁ జదివి వల్లింపుము.

హరి: నా మాధుకరపుసంచి నిన్నరాత్రి యెలుకలుకొట్టినవి. అదికుట్టుకొనుటకు సూది, దారముకొఱకు వచ్చినాను.

బ్రాహ్మ: ఓరీ! మూర్ఖుఁడా! ఇంక నీకుఁ జదువు రాదురా! (అని కొట్టు చున్నాఁడు)

హరి: ఈ కఠినాత్ముఁడు నన్నుఁ బేల్చుకొని తినుచున్నాఁడు. నే నిక్కడ నుండి లేచిపోయెదను.

బ్రాహ్మ: ఓరీ! పోయి ఒకసారి మాకుఱ్ఱవానిని రమ్మని చెప్పుము.
(అపుడు బ్రాహ్మణ కుమారుఁడు ప్రవేశించును)

కుమా: నాయనా! నిన్న నీవు నాకిచ్చిన పనస వచ్చినది. ఇంకొకటి చెప్పు. త్వరగా చెప్పు, చెప్పరా నాయన?

బ్రాహ్మ: ఆ! చెప్పెదను విను, వల్లించు, ఓరీ! హరిశర్మా! నీవు కూడ నీ పనసంత చెప్పివెళ్లు (అని చెప్పును.)

కుమా } చెప్పుకొను చున్నారు
శిష్య }

(బ్రాహ్మణుని భార్య ప్రవేశించుచున్నది)

భార్య: (తనలో) ఈయన యెల్లప్పుడును విద్యార్థులకు వేదము చెప్పుచుఁ గూర్చుండుటయె కాని, యింటిలో నేమి కావలసినది యడుగఁడు. ప్రతి వస్తువునకు నాడుకూఁతురను నేనే యేడువవలయును. అబ్బా! నేనేకాని యీ శ్రమ యితరులు పడలేరు. ఈయనతోఁ గాపురమునకు వచ్చినదాది నేఁటివఱకు నొక్కటే దారిద్ర్యము. ఈయన వేదము పరీక్షించి ఒక దమ్మిడీయయిన నిచ్చువారు లేరు. నేనేమి చేయలేక చచ్చుచున్నాను. (ప్రకాశముగా) ఓరీకుఱ్ఱ వాఁడా! మీనాయనగారు వేదముచదివి పాడయిపోయినారు.

నిన్నుఁగూడఁ బాడుచేయుచున్నారు. ఈపాటికి వేదము చాలించి లేచి నీవయిన మానేఁడు గింజలు తీసికొనిరా! లే!

బ్రాహ్మ: ఓసీ! మొద్దా! చదువుకొనువానిని జెఱిపివేసెదవేమి? నీకేమి చేటు కాలమా?

కుమా: నాయనా! అమ్మతోనేమికాని నాకు వేదములెన్నియున్నవో వాని విభాగములేమో చెప్పుము.

బ్రాహ్మ: అబ్బాయీ! మీయమ్మ యేమయిన అనునేమో అని భయము. ఇఁక నేఁజెప్పను. నేఁడు అమ్మాయిజాడ లేదేమి?

భార్య: అమ్మాయి? అది యూరివారందఱితోడను పోరాడునా? ఇంటిలోఁ బనియేచేయునా? అదికూడ నాపాలిళనిగ్రిహముగానే యున్నది.

పిల్ల: (ప్రవేశించి) ఓఅమ్మా! ఎక్కడ చచ్చినావు రావే అమ్మా!

భార్య: ఓసీ! ఇక్కడనున్నాను. ఇటురా. నన్నుఁదిట్టుచున్నావు. నీకు చేటుకాలము వచ్చినది. (అని కొట్టుచున్నది)

పిల్ల: అమ్మయ్యో! నీకేమివచ్చినదే! (ఏడ్చి) నాన్నా! చూడు. కొట్టుచున్నది.

బ్రాహ్మ: ఊరుకో! పెద్దపిడకదిమ్మలాగు చేతులు నీవును. దానిని గొట్టెదవేమి?

భార్య: మీసొమ్మేమిపోయినది. మిమ్ముఁగొట్టలేదుగదా!

పిల్ల: అమ్మా! పాట ఒక్కటిచెప్పు. త్వరగాచెప్పు.

భార్య: నీకును నాకును బాటకూడనా? మంగళహారతి చెప్పెదను.

పా॥ మంగళం, జయమంగళం, నిత్య శుభమంగళం.

పిల్ల: ఈపాట అన్నయ్య పెండ్లికిఁ బాడెదను.

కుమా: నాకుఁ బెండ్లివద్దు. నేను బ్రహ్మచారినై యుందును.

బ్రాహ్మ: ఛీ! అట్లనకురా! అమంగళము.

పిల్ల: నా కైదుగురు భర్తలు కావలెను.

బ్రాహ్మ: ఊరుకోవే, ఆలాగున ననకూడదు. తప్పు.

భార్య: ఎవ్వరోకాని మన యింటికొర్గుఱు వచ్చుచున్నారు.

బ్రాహ్మ: ఎవ్వరు? ఎవ్వరే? చెప్పు చెప్పు.

భార్య: బ్రాహ్మణులవలెనున్నారు. అందులో నొక ముసలావిడకూడ నున్నది.

ధర్మ: (తెరలో) తమ్ములారా! భీమార్జున నకులసహదేవులారా! నేను లోపలికరిగి మనకు నివాసయోగ్యమగు స్థలమొసంగుదురేమో యింటివారి నడిగివచ్చెదను.

(కుంతి, ధర్మజ, భీమ, అర్జున, నకులసహదేవులు ప్రవేశింతురు)

భీము: అన్నయ్యా, మనము పరమ సుక్షత్రియులమైనను భూసురప్రవరుల యాకారంబులు ధరించి యీ యేకచక్రపుర నివాసంబు నలుపఁదలంచితిమికదా! మనము జీవనాధారోచితముగానే వృత్తి నవలంబించి దినంబులఁబుత్తము. దానిని ముందుగ నిశ్చయింపుఁడు.

ధర్మ: (చిఱునవ్వుతో) తమ్ముఁడా! చతుర్వేదానవద్యవిద్యాప్రవీణులగు విప్రులతెఱంగున నుండి యేవృత్తి నవలంబింతుమని యడుగనేల? బ్రాహ్మణ వేషధారులగు జనులు బ్రాహ్మణవృత్తిగాక మఱియొక

వృత్తి నవలంబింతురా? కావున మనము మాధుకరము చేయుచు బ్రహ్మచర్యము సలుపుచుందము. దానికి—

భీము: (కోపముతో) హరి! హరి! ఎంతమాట! సప్తద్వీప పరిపాలనా నిపుణుఁడగు పాండుమహారాజు పుత్రులమై యనేక మహా మహీసుర వర్గంబులకు గోసహస్రంబులు, నగ్రహారంబులు నవాంఛితంబుగ దానంబొసంగునట్టి మనము మనచే నగ్రహారం బులు వడసిన బ్రాహ్మణులయింట మాధుకరమొనరించి యుం డుట తగదు. ఒకవేళ మీరిచ్ఛగించినను నేనావని నొనరింపను.

ధర్మ: తమ్ముఁడా! నామాట వినుము. ఇది కృష్ణద్వైపాయన నియో గంబుగదా! కావున నవశ్యము మాననీయము. ఇంక నాగ్రహిం పకరమ్ము. అదిగో బ్రాహ్మణోత్తముఁడు శిష్య, పుత్ర, కళత్ర పుత్రికాసమేతుఁడై యున్నవాఁడు. అచటికిఁబోయి బసయడుగు దము.

భీము: సరే! అట్లయినఁదమ చిత్తము. నడువుఁడు.

ధర్మ: (తమ్ములతోఁబోయి) మహాత్మా! భూసురోత్తమా! మాతృ భ్రాతృ సమేతుండనై నమస్కరించుచున్నాఁడను.

బ్రాహ్మ: దీర్ఘాయుష్యమస్తు: నాయనా! మీరెవ్వరు?

ధర్మ: మేము ద్విజులము. ఈపురవరంబునఁ గొంతకాలంబు వఱకు నుండునుద్దేశమున్నది. కావున మీగృహంబున మాకు స్థలమిచ్చి యాదరింపఁగలరా?

బ్రాహ్మ: ఆముసలామె యెవ్వరు?

ధర్మ: ఆమె మా జనని.

బ్రాహ్మ: దృష్టి భయంకరుండై దృఢతరకాయుడై మహాబలుండైన యీ పురుషుండెవ్వడు?

ధర్మ: ఆతండు నాయనుజుండు, మహాబలుండు.

భీము: అన్నయ్యా! నేను భవత్సహోదరుండనని పచించితిరి కాని మదీయ బలపరాక్రమముల నెఱుంగఁజెప్పరయితిరె. ఈ బ్రాహ్మణోత్తమున కీదినంబు మొదలు భూత, పిశాచ, రాక్షస, నివహంబుల వలని భయంబులేదని చెప్పుండు.

ధర్మ: తమ్ముండా! అది నీశరీర సందర్శనంబుననే యందఱికిం దెలియును.

బ్రాహ్మ: ఓయీ! ఆజానుబాహుండును, సౌజన్యగుణధాముండును నగు నీతండెవ్వండు?

ధర్మ: ఈతండు నారెండవ యనుజుండు.

బ్రాహ్మ: మారసుకుమారాకారుండగు నిక్కుమారుండెవ్వండు?

ధర్మ: ఈతండు మామూండవయనుజుండు, అతిసుకుమారుండు.

బ్రాహ్మ: లావణ్యగుణసీమయగు నమ్ముద్దులు గుల్కు పిన్నవాండెవ్వండు?

ధర్మ: ఈతండు నాకడసారి యనుజుండు. ఈతనిఁబాసి మేమొక నిమిషంబయిన నిలువఁజాలము. మాజననియు ముహూర్తకాలంబైనఁ దాళఁజాలదు.

బ్రాహ్మ: సరే! సరే! ఇప్పుడు నీవు జ్యేష్ఠుండవని తేటపడినది. మీయేవురకును మాతయగు నీనాతి కడు నదృష్టవంతురాలు. కాని మీ రూపరేఖావిలాసంబులంజూడ భూమండలసామ్రాజ్యంబు పరిపాలింపఁదగిన వారుగానున్నారు. అట్టి మీకు బ్రాహ్మణ జన్మం

బులెత్తి మాతో సంభాషణలకుఁదిరుగ నావిఘ మెచ్చట బ్రాసెనో గదా! నాయనా? మీజీవనాధార మెట్లు?

ధర్మ: (తనలో) ఈతండు ఘనభారము తనపైఁబడునని యెంచుచున్నాఁడు గాఁబోలు! (ప్రకాశముగా) మేమిచ్చట మాధుకరము చేయుచు బ్రాహ్మణప్రసాదంబు నొందుచు వేదశాస్త్రాధ్యయనము నొనరించుచు మీయింట వసియించెదము. ఇష్టమైన బస యొసంగుఁడు.

బ్రాహ్మ: అయ్యో! దానికేమి? మీయిష్టమువచ్చినన్ని దినంబులు మాయింట నుండవచ్చును. మీయంతట మీరు పోవలయునుగాని మేమట్లు పొమ్మని చెప్పము.

భార్య: మా కష్టసుఖంబులు మీవియు, మీ కష్టసుఖంబులు మావియుగా నుండవలయును (అని) ఇప్పుడు మీకు బసచెప్పెదను వినుఁడు. పడమటింటివెనుకఁ బంచపాళీలో వంటచేసికొని తూర్పుచావడి వెనుకనున్నమూల గదిలో పెద్దగోడ దగ్గఱ కిటికీ సమీపమున కొంచెము మూలగా దలుపుదగ్గఱ మాత్రము గాకుండ—ఆ యిటు కలుకట్టినచోట మాధుకరపుఁగూడు దాచుకొనుఁడు. మాయింట మార్జాలభయమెక్కువ. అన్నము నుంచదు. జాగ్రత్తగా మాత్ర ముండుఁడు. ఉత్తరపుటింట తూర్పుభాగమున నిప్పుడు మేము మంచము వేసికొనుచోట సామాను తీసివేసి పండుకొనవచ్చును. ఇంటి పాచిపనియంతయు మీముసలామె చేయవలయును. అట్లయిన నుండుఁడు. ఇఁకఁబోయి మీ ఝల్లాజానుచేసికొనుఁడు.

కుంతి: అమ్మా! అట్లేయుండెదము. (అని కుంతి, పాండవులు వెళ్లదురు)

కుమా: నాయనా! వీరు ఆజుగుతు మనకెందుకు? వారియిష్టమువచ్చిన చోటికిఁ బొమ్మనుఁడు.

బ్రాహ్మ: అట్లుగాదు నాయనా! వారు (అని) ఏమోకాని నాకు భయంబు పుట్టి గుండెలు కొట్టుకొనుచున్నవి. కారణమేమియో యూహింపఁ జాలను.

(అప్పుడు ఒక భటుఁడు ప్రవేశించును)

భటు: (తనలో) ఈదినమున బకాసురున కీ బ్రాహ్మణుని యింటివంతు వచ్చినదని చెప్పుటకు గ్రామాధికారి నన్నుఁబంచెఁగదా! ఇట్టి దుర్వార్త చెప్పుట నాపాలఁబడినది! ఏమిదైవమా! ఈవార్త విన్నతోడనే వీరెట్లు విచారింతురో! బకాసురుఁడందల నొకమాఱు తినుట మాని సంవత్సరంబున నొకరిని దినుచున్నను మిగులఁ గష్టంబుగా నున్నదిగదా! (ప్రకాశముగా) ఏమండోయి?

బ్రా: ఎవ్వరువారు? ఏమిపనిమీఁద వచ్చితివి? ఎవ్వరి సెలవు పొంది వచ్చితివి? ఎవరు పంపిరి? తక్షణము చెప్పు?

భటు: (తనలో) నీసంకటము కుదురుట కిప్పుడే సమయము వచ్చినది. (ప్రకాశముగా) ఈదినంబున మీయింట నేకచక్రపురాధినాధుఁడగు బకాసురునకు బలి పంపు వంతు వచ్చినదని గ్రామాధికారి నన్నుఁ జెప్పుమనెను. నేను జెప్పితిని. ఇంక జాగ్రత్తపడుఁడు. నేను బోవుచున్నాఁడను. (అని పోవుచున్నాఁడు).

బ్రాహ్మ: (గుండెబాదుకొని) అయ్యో! అయ్యో! మాయింటనే! మాయింటనే! మాయింటనే! అయ్యో! అయ్యో! ఇంకేమున్నది? కొంప మునిఁగినదే! కొంప గుండమైపోయినది. ఎవనిఁ

బంపనురా నాయనా? (అనియేడ్చును) మాకీ బకాసురుఁ డెక్కడ దాపురించినాఁడు.

భార్య: అయ్యో! మాయింటనే సంభవించెనురా నాయనా? ఇన్నాళ్ళనుండి యూరందఱిమీఁదఁ బడుటయేగాని మాయింటి కెన్నఁడును రాలేదురా తండ్రీ! ఇది యెక్కడి కష్టమురా!

పిల్లలు: (ఇద్దరు నేడ్చుచున్నారు.)

బ్రాహ్మ: (కన్నీళ్ళతో) ఓసీ నీవు పిల్లలను కనిపెట్టుకొనియుండు. నేను బోయి వంతుతీర్చెదను. (అని కౌఁగిలించుకొని యేడ్చును.)

భార్య: అయ్యో! అలాగు కాదు. మీరుపోయిన రెక్కలురాని యీ పిల్లల నెవరు సంపాదించి పోషింపఁగలరు? కాన మీరే యుండుఁడు. నేఁబోయెద—

బ్రాహ్మ: అయ్యో! సంపాదించిన వండిపెట్టి సంరక్షణచేయువా రుండ వద్దా? కాఁబట్టి నేనే పోయెద. నీవు వీరిని జూచుచుండుము.

కుమా: నాయనా! నీవువద్దు. నీవుపోయిన సంసారము నామీఁదఁబడును. నేఁబోయెద, నన్నుఁబంపుము.

బ్రాహ్మ: అయ్యో: కొడుకా! ఎంతమాటంటివిరా తండ్రీ! నీకెంతటిదశ గల్గెనురా! నాయనా! నీవు పోయిన నేమున్నదిరా నాయనా? నీవెంతో యుద్ధరింతువని తలంచితినిరా తండ్రీ! నీవుపోయిన వంశమంతయు నశించును. చచ్చిన తర్వాత కొంచెము నీళ్ళ చుక్కలు వదలిన మాకు గతులు గల్గును. కాన నేనేపోయెద.

భార్య: నీవువద్దు. నేనేపోయెదరా తండ్రీ!

పిల్ల: మీకు వంతులు తెగనియెడల నన్నుఁబంపుఁడు. నేను బోయెదను.

తల్లి: అయ్యో! నీవుపోయినట్లయిన నెట్లునిల్తుమే తల్లీ! నీవువద్దు. నేనే పోయెద.

బ్రాహ్మ: అయ్యో! పుత్రికవల్ల దౌహిత్రిలాభము గల్గును. అతనిచే మాతామహులకుఁ బుణ్యలోక ప్రాప్తి కల్గును. అట్టి నిన్నెట్లు పంపఁజాలుదును. నేనే పోయెదను.

భార్య: మీరుకాదు నేనే పోయెద.

కుమా: నేఁబోయెదరా తండ్రీ! మీరువద్దు.

పిల్లలు, పుత్రిక: నాయనా! అమ్మా! మీరిరువురునుగాదు. ఆలస్యము చేయక నన్నుఁబంపుఁడు.

[తెరలో] అమ్మా! ఈదినమున నేను మాధుకరార్థం బియ్యగ్రి హారమున కరుగలేదు. నేను వాకిలిద్వారమున నుండ నేదియో యొక రోదన ధ్వని వింటిని. అది యేదియో తెలిసికొనిరమ్మ. కాదుకాదు. నేనే వచ్చెదను.

కుంతి: అయ్యా! బ్రాహ్మణోత్తమా! తమరింత రోదనముచేయఁ గారణ మేమి? తమకేమి కష్టము ప్రాప్తమైనది?

బ్రాహ్మ: అయ్యో! కష్టమేమని చెప్పఁగలనమ్మా!

భార్య: అమ్మా! కష్టమేమిటి? ఈగ్రామములో బకాసురుఁడను రాక్షసుఁడు గలఁడు. వానికి దినమున మాయింట వంతు.

కుంతి: మీయింటనే? అయ్యో! పాపము! అయితే ఆబకాసురున కేమియ్య వలెను?

బ్రాహ్మ: (ఏడ్చుచు) ఏమున్నది! పుట్టెఁడుబియ్యపుటన్నము వండుకొని పుట్టెఁడు పప్పును తీసికొని, రెండు మహిషంబులతో బండి నొకటి మాయింట నెవ్వరయిన తోలుకొని వానికడకుఁ బోవ లెను. ఆమనుష్యుని సహితము వాఁడు భక్షింపఁగలఁడు.

కుంతి: హా! ఎంతకష్టము? బ్రాహ్మణోత్తమా! ఇది తమబోటి సత్తము లకు రాఁదగిన కష్టముగాదు. అందుకు మీరెవ్వరు పోఁదలఁచితిరి?

బ్రాహ్మ: అమ్మా! మాకు సంతులు తెగక యొక జామునుండి యిట్లు రోదనము చేయుచున్నాము. ఏమియుఁదోఁపదు. కుమారుని పం పుదమన్న వంశముండదు. కుమార్తెను బంపుదమన్న దౌహిత్ర ప్రాప్తియు, మాకుఁబుణ్యలోక సంభవమును గలుగదు. నేఁబో యిన సంసారమును భరించువారులేరు, నాభార్యపోయినయెడల వీరలను సంరంక్షించువారు లేరు. ఆకారణంబున నేమియుఁ దోఁపక యెవ్వరింబంపక యూరకుంటిమి.

కుంతి: అయ్యో! భూసురోత్తమా! ఇట్లు జాగుచేసినయెడల నాదుష్ట రాక్షసుఁడు మహాగ్రహంబున నందఱభక్షింపఁగలఁడు. వేగమేదో యొకటి చేసి యెవ్వరినో పంపుఁడు.

బ్రాహ్మ: అమ్మా! నేఁబంపెడిదేమి? మా నలువురిలో నెవ్వరిఁబంపిన ననుకూలంబో వారలఁబంపుము నీయాజ్ఞానుసారముగాఁ బోయెదము.

కుంతి: అయ్యో! [తనలో] వీరలు నలువురు నొండొరుల విడువఁజాల కున్నారు. వీరిలోనెవ్వరినిబొమ్మని చెప్పఁజాలుదును. ఈబ్రాహ్మ ణోత్తముని దెసఁజూచిన నా హృదయము కరగుచున్నది. ఇంక నేనేమియుఁ జెప్పఁజాలను [ప్రకాశముగా] అయ్యా! నేనొక్క

యపాయవిహీనమగు నుపాయంబుఁ జెప్పెదను, దానికిఁదా మంగీకరింపవలయును.

బ్రాహ్మ: అట్లే యంగీకరింతును గాని యీవిషయమున నపాయములేని యుపాయమెట్టులుండును?

కుంతి: అదియే చిత్రము. అపాయము లేశము నుండదు. భూసురోత్తమా! నాకు పంచానన ప్రతాపులగు కుమారు లేవురుగలరు. వారిలో నొకరికంటె నొకరు బలవంతులు.

బ్రాహ్మ: ఆమాట సత్యమే! అయిన నావిషయమ్మేమి చెప్పెదవు?

కుంతి: చెప్పుటకేమున్నది? అందొక్క కుమారుని నారాక్షసాహారమున కర్పించెదను. మీయింటఁ గాపురముండి యీ యుపకారము చేయ లేక పోవుట మంచిదికాదు.

బ్రాహ్మ: శివ! శివ! ఎంతమాట? యెంతమాట? (చెవులుమూసికొనును)

భార్య: అమ్మా! అట్టి మాటల నాడఁబోకుము. జన్మాంతరంబున నెవ్వరి నిట్లు బాధించుటచేతనో నేడిట్లు తటస్థమైనది. ఇంకనట్లు చేయ నేల? చాలుచాలు!

కుంతి: అమ్మా! అట్లు వచియింపఁబోకుఁడు, మీకొక్కఁడే పుత్రుఁడు. నే ననేక పుత్రికురాలను. నాసుతులలోపల నొక్కని నిచ్చిన నాకు లోపంబు వాటిల్లదు. కావున దానికంగీకరింపవలయును.

భార్య: అట్లు వచించుట భావ్యంబుగాదు. తల్లి గర్భవాసమునకు నూర్వురు కుమారులున్నను బ్రేమ యందఱియందు సమానమైయుండును. ఒకరు గతించినను దుఃఖమధికమే. నాకొక్క పుత్రునియం దెంత ప్రేమగలదో నీకొక్కనియందంత ప్రీతియుండుట

సహజమే. నీవిట్లు చెప్పినయెడ నా హృదయము తత్తరపడు చున్నది.

బ్రాహ్మ: అమ్మా! ఆమాట సత్యమే! అదియునుగాక మీరు బ్రాహ్మణోత్తములు. గృహంబులేక మా యింటఁ గాపురము చేయఁ దలంచి వచ్చిన మిమ్ములను వానికి సమర్పించుట కంగీకరింపను. మఱియును బ్రాహ్మణ వధకు నేనెట్లు సహింతును. పంచమహాపాతకములయందతి ఘోరతరమైన బ్రాహ్మణ వధకు నేనియ్యకొని తజ్జనితమహాదోషమనుభవించుటకంటె నేఁబోవుటయే మేలు.

కుంతి : అయ్యా! అట్లయిన నాత్మవధాసక్తులయిన మీకు నాత్మవంచన మహాపాతకమురాదా? అట్టి మహాపాతకంబున కెట్టులోడఁ బడియెదరు?

బ్రాహ్మ: అమ్మా! తానొనరించుకొనినయెడల నాత్మవధయగునుగాని యన్యులు తన్నుఁ వధియించిన నదియాత్మవధగాదు. నన్ను బకాసురుండే వధియించెడిని. గాన నాకు దోషములేదు, నేఁ బోయెద.

కుంతి : అయ్యో! వీరలెన్నివిధములఁజెప్పినను వినకున్నారు. నా కుమారుఁడు మహాబలశాలి. ఈ రాక్షసాధమునిచేతఁ జావఁడు. ఇట్టి దుష్టరాత్రించరాధముల బెక్కుర మర్దించెను. కావున మీరియ్యకొనుఁడు.

బ్రాహ్మ: (తనలో) ఈమె కుమారుఁడతిసాహసుఁడేకానియెడల నిట్లు ప్రియపుత్రుని స్వయముగా రాక్షసునికిచ్చునా? (ప్రకాశముగా) నీవు పలుతెఱఁగుల నింత బలవంతపఱచుచుండఁగా నేనెట్లు నీమాట తీసివేయఁగలను? కావున నియ్యకొనవలసివచ్చినది.

భార్య : అమ్మా ! నీకొడుకు మహాబలవంతుఁడు కావున రక్షోనాథుని వధయింపఁగలఁడని యెంచియో లేక మామీఁద నిర్హేతుక కటాక్షము గల్గి పరోపకారార్థచింతచేతనో నీవు కుమారునీఁదలంచితివి. మేము నియ్యకొంటిమి. ఇంక నీ వీయఁదలఁచిన పుత్రి ప్రత్నమున కభ్యంగస మొనరింపుము.

బ్రాహ్మ: నీవొకవేళ నీపుత్రుని పంపఁదలంచినను నీకుమారులందఱు సమ్మతింతురా ? పోవుటకా కుమారుఁడు సమ్మతించునా ?

కుంతి : మత్కుమారులు, మదాజ్ఞానుసార వర్తనులు. దానికేమిగాని యీ బకాసురునికై కావలసిన యన్నపాన భక్ష్యపదార్థంబుల నాయత్తము చేసికొనిరండు. మామూలుకంటె నీ దినమున నధికముగా నన్నంబు పండుఁడు. ఇంక మీరందఱును లోపలికరిగి మీ ప్రియత్నములలో నుండుఁడు. పొండు.

అందఱు: అట్లే చేయుదము. (అని వెళ్ళుచున్నారు.)

కుంతి నిలుచును.

కుంతి : (తనలో) ఈ దినమున మత్కుమారుఁడగు వృకోదరునకుచరంబునిండిన యాహారము లభించినది. వానిని బిల్చి యీ వార్త చెప్పెదను. (రహస్యముగా) భీమసేనా ! నీకొకవార్త చెప్పెదను.

భీము : (ప్రవేశించి తనలో) ఈ యేకచక్రపురాగ్రహారము ప్రవేశించిన దాదిగా నేఁటివఱకు నొక్కపూటయు వాటముగా నోటికొలఁది యన్నము దొరకదయ్యెను. మేమేపురమును మాధుకరముచేసి తెచ్చిన యాహారమున సగముభాగము నేను గైకొన్నను నా

యాఁకలి తీరుటలేదు. ఏమిచేతును ? (అని కడుపు తడపు కొనును.)

కుంతి : నాయనా ! నీకొక ప్రియమెఱిఁగించెదను. నేఁడు నీయాఁకలి పూర్తిగాఁదీరును.

భీము : అమ్మా ! అదియేమో త్వరగాఁజెప్పుము.

కుంతి : మనము వసియించుచున్న యీ గృహయజమానుఁడగు భూసు రోత్తముని యింట నీపురముననున్న బకాసురునకు వంతు వచ్చినది. అందుకొక మనుష్యునిఁ, బుట్టెఁడు బియ్యమన్నమును, బప్పును, బకాసురునకు వండఁగలరు. ఆ బకాసురునికడకు నిన్నుఁ బంపుదాననని వాగ్దత్తము చేసితిని. అది నీకిష్టమేనా ?

భీము : అమ్మా! మంచిపని చేసితివి. అయితే పుట్టెఁడు బియ్యముకాదు వండుదురా ? ఆ మాట కనుఁగొనుము.

కుంతి : కుమారా ; రెండుపుట్ల బియ్యము వండుమని చెప్పితిని. అట్లు వారవశ్యము నాచరింపఁగలరు.

భీము : (భుజములు చఱచుచు గంతులు వైచుచు) అహాహా ! నేఁటికి నాయాఁకలి దీరుదినము సంప్రాప్తమైనది. చిరకాలమునుండి యాహారములేక కృశించుచున్న మదీయదేహము నేఁడు పూట పడఁగలదు. ఆ బకాసురుని దప్పక తుదముట్టించి యేకచక్రపుర నివాస ప్రకృతి మానవహృదయ సంతాపంబు దీర్చెదను. కాని మాయన్నగారు దీనికి సమ్మతింపవలెఁగదా !

(అప్పుడు మాధుకరపు సంచితో ధర్మార్జున నకులసహదేవులు ప్రవేశింతురు.)

ధర్మ : దినకర కరహతుడనై కరముడస్సినాఁడను. ఈ మాధుకరపు సంచి మోయలేక తెచ్చితిని.

సహ : అమ్మా! నా పాదములు మిగుల నొచ్చుచున్నవి. ఎక్కుడు గుమ్మము, దిగెడు గుమ్మము కావునఁ గాళ్లు పడిపోయినవి.

నకు : ఈ మాధుకరపు సంచి మోయలేక చేయి లాగుకొని వచ్చుచున్నది. రెండవ చేతితోఁ బట్టుకొనెదమన్న పంచపాత్రి.

అర్జు : అమ్మా! ఈ దినమున మదీయ మాధుకర కక్షపాల నొక్క గొప్ప పిడుగుపడెను. దానిఁబట్టుకొని పోనియ్యకుండ నా పది నామములఁ దలంచిన స్థలంబున నింకనెన్నఁడును పిడుగులు పడకుండునట్లు వరమునిచ్చినది. అప్పుడు దానిని నేవదలినాఁడను.

కుంతి: కుమారా! అతిసాహస కార్యమొనరించితివి. సహదేవా! ఇటురా. పాదములు నొప్పులు దీరుదాకఁ గూర్చుండుము అబ్బాయీ నకులా! నీచేయి యిటులిమ్ము. అది కొంచెమొత్తెదను. నాయనా! ధర్మనందనా! అతిసుకుమారుఁడవగు నీకిట్టి మహా క్లేశంబు గలుగఁజూచుచు జీవించియుండుమని విధి నాకువ్రాసెఁ గదా! ఆ మాదిరితో నేనేల పోవనైతిని (విచారించుచున్నది.)

భీము : (తనలో) ఈ మహారాజు మాధుకర మొనరింపలేక యతిక్లేశము నొందుచున్నాఁడు. అహాహా! దైవమా! ఈ మహాభోగి కష్టముల నెన్నండు గట్టెక్కించెదవు? వీరల శ్రమను జూచుచు నే నిచ్చోట నుండను. లోపలికరిగెదను.

ధర్మ : తమ్ముఁడా! అలసట తీరినది. వద్దువద్దు. (తనలో) ఈ దినమున మన భీమసేనుఁ డేమి కారణమువనో కడు సంతోషమున

నుపొంగుచున్నాఁడు. దీనికేదియో హేతు వుండవలెను. (ప్రకాశముగా) అమ్మా ! భీమసేనుం డధికతర కుతూహల భరితాంతరంగుఁడై యున్నట్లగపడుచున్నాఁడు. కారణమేమియో యెఱుంగుదువా ?

కుంతి : కుమారా ! యుధిష్ఠిరా! దానికి సరియగు కారణమున్నది. ఈ దినమున మనకు వాసముచేయు గృహాయజమానుండగు విప్రవరునియింట బకాసురునకు వంతువచ్చినది.

ధర్మ : అయ్యయో ! ఎంత కష్టము ! వార నలువురిలోపల నెవ్వరైన పోవలయును గాఁబోలును. మనమెచ్చోటనుండిన నచ్చటనే యాపదలు తటస్థమగుచున్నవి. తరువాత చెప్పు.

కుంతి : అట్లు వంతుకలదని వీరలు విని రోదనము మేదిని పగులునట్లు చేయఁగా, నేఁబోయి మదీయ కుమార రత్నమైన మహాబల గంధవాహనందను నర్పింతునని వాగ్దత్తము నొనరించితిని. అందుచే—

ధర్మ : (ఆశ్చర్యముతో) ఏమి ? భీమసేను నిచ్చెదననియే వాగ్దత్తము చేసితివా ? భీమసేనునే ! భీమసేనునే! అయ్యో! ఎంతకష్టము! అమ్మా ఎంతపని చేసితివి? అయ్యో !

కుంతి: కుమారా! అట్లు భయపడియెదవేమి? భీమసేనుఁడు ప్రకృతి మానవుఁడని తలఁచుచుంటివి కాఁబోలు.

ధర్మ: [విచారముతో] అయ్యో! ఎంతటి మహాబలుఁడయినను నరుఁడు రాక్షసునిఁ జంపనోపునా? తప్పక మృత్యు వొందును. ఇది యేదో పాండవకులచ్ఛేదమునకై వచ్చినది. హా! దైవమా ?

ఉ॥ ఎక్కడి వారణావతము యెక్కడి లక్కగృహంబొ యయ్యయో!
యెక్కడి యేకచక్రపుర? మెక్కడవచ్చె బకాసురాధముం?
డెక్కడి పాపకర్మమిది? యేమియుఁ ద్రోపదికేమి సేయుదున్
రక్కసుచేతఁదమ్ముఁడికఁ బ్రాణముఁ గోల్పడకుండ నేర్చునే!

అర్జు: అన్నయ్యా! ఈమాత్రపుఁగార్యంబున కనుజు ధైర్యం బెఱుంగ నేరక యూరక దుఃఖ మొందెదరేల?

ధర్మ: తమ్ముఁడా! నీదృష్టికి స్వల్పకార్యమని తోఁచుచున్నది, గాని నా కధికకార్యమని కన్పట్టుచున్నది. నాకుఁ జింత యేలయన?

చ॥ ఘనతరపాశబద్ధుని నకారణవృత్తినొనర్చి కౌరవుల్
వనమునఁ ద్రోసివేయ మును బాయని యట్టి సహోదరుండు, భో
జనమున దారుణంబగు విషంబిడఁ జావని సోదరుండు, నీ
దినమున నేకచక్ర పురిఁ దీరుఁగదా యని చింతపుట్టెడున్.

అర్జు: అన్నయ్యా! తమరిట్లు వృథావ్యథ బొందుట మేలుగాదు. అమ్మగారు వాగ్దానము గావించి వారి కభయ ప్రదాన మొసంగిరి. కావున నట్లవశ్యము నాచరణీయమే. దేవరమాత్ర మెఱుంగరా? బ్రాహ్మణోత్తముల కాపద వాటిల్లునెడ క్షత్రియులమైన మన మూరకుందుమా? వారి కవశ్యము సహాయము చేయవలదా? కావున మీరు దుఃఖింపవలదు. భీమసేనుఁడు బకాసుర సంహారం బొనరించి పునర్దర్శనము చేయఁగలఁడు.

ధర్మ: తమ్ముఁడా! పునర్దర్శనము మఱల నాతఁడు చేయుటెక్కడిది?

తే॥గీ॥ అల హిడింబునిఁ బరిమార్చి నట్టియనుజు
నల గదాయుద్ధవేదియైనట్టి యనుజు
బకుని కేకచక్రపురిని బలియొసంగి
పంచపాండవుల్ నల్వురై బ్రిదుకఁగలరె?
ఈ యేకచక్రపురి నివాసం బిందులకే వచ్చినది.

కుంతి: ధర్మనందనా! బ్రాహ్మణవేషధారి నయిన వెనుక సహజధర్మం బగు క్షాత్రకాఠిన్యము విసర్జించి వేషభాషానుకూలమైన మార్దవం బవలంబించుచుంటివి. ఈభీమసేనుఁడసాధారణ బాహుబలుఁడు. వనాంతరమున హిడింబాసురుఁ గడతేర్చుట నీవెఱుంగవా? నీ కన్నులతో నివియన్నియును వీక్షించుచునే దుఃఖమొందెదవు?

అర్జు: అన్నయ్యా! లోకంబునఁ గుమారులపై జననికింగల ప్రేమము కంటె సహోదరాది బాంధవులకుఁ బ్రేమంబు తక్కువయుండును గాని యధికంబుండ నేరదు. అట్టియెడ జననియే యతనిఁబంపుట కియ్యకొనుచున్న మీరింత వాపోవనేల? భీమసేను బలాతిరేకంబు మిగుల నెఱుంగును గాన జనని మాట నిచ్చినది. దాని నరసియైన మీరు శాంతింపవలయును.

ధర్మ: తమ్ముఁడా! జనని తనయు నెడల నధికప్రేమాస్పదురాలై నను నొకవేళ యెఱుంగక యిట్లొనరించెనని తలంచుచుంటిని. అట్లెఱుంగక యిట్లొనరించిన మోసము వాటిల్లును గదా!

అర్జు: ఔను! నిజమేకాని భీమన్న సామర్థ్య మమ్మ యెఱుంగదా?

కుంతి: కుమారా! భీమసేను దుర్వార పరాక్రమంబెఱిఁగించెద.ఈతండు జన్మించిన దశమదివసమున శతశృంగ ధరాధరేంద్రమున నేను ను మీజనకులు పాండుమహారాజుగారును వీనిని దేవదర్శనార్థమై

కొనిపోవుచుండ నాఖీలశార్దూలమొండు మాపై రాఁబోయెను. అంతట నబల నగుటచే నేను బరువిడ నారంభించితిని. ఒడిలో నున్న భీమసేన కుమారుఁడు పర్వతముపైఁ బడెను. అంతట నా మహీధరమాతఁడు పడినంత స్థలమును జూర్ణమైపోయెను. కుమారా! ఆతని వజ్రకాయము తెలుఁగెఱుఁగుము. కావున నాత నికి నిశాచరుని వలన భయములేదు.

అర్జు: అట్లయిన నన్నయ్యా! అమ్మగారు చెప్పినట్లు

క. జననము నొందిన పదియవ
దినమున నుర్వీధరంబు దీరత నుసిగా
నొనరించిన ఘన బాహునిఁ
జన నింపిఁక జాగుసేయఁ జనదు మహాత్మా!

ధర్మ: మాతృభ్రాతృవచన ప్రికార మొనర్పుట యావశ్యకము. ఏదీ? భీమసేనుని వదనారవింద మొక్కసారి చూడఁగోరుచున్నాను.
(అప్పుడు భీమసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

భీమ: బకాసురాధము నొక్క ముష్టిప్రహారమునఁగూల్పఁగలవాఁడను. (తనలో) ఐనను మత్సహోదరుఁడు యుధిష్ఠిరుఁ డనుమతినీయ వలయుఁగదా? అదే మత్సహోదరులు జననియు నటనున్నవారు. నేనే స్వయముగాఁబోయి యన్నగారి యభిప్రాయ మెఱింగెద. (అని వచ్చును.)

కుంతి: కుమారా! భీమన్న! యుష్మద్బలదర్పంబు లెఱుంగక యుధిష్ఠి రుండు నీవిషయమై ఖేదంబు నొందుచున్నవాఁడు నీవుకూడ నాతని దుఃఖం బుపశమింపఁజేయుము.

భీము: అన్నయ్యా! లాక్షాగృహ మహాదవానల పరిరక్షిత నిజసోదరులం డగు వృకోదరు దుర్వార బలపరాక్రమంబు దేవర యెఱుంగరా? నిర్జరేంద్రవిభీకరుఁడగు హిడింబాసురు నమ్మేయి నంతక నిలయం బున కంపలేదే! అదిగాక పాండునందన వజ్రప్రాకారుండనగు నాకు నాహీనుఁడగు బకాసురాధముఁడు హాని సలుపఁగలఁడని యెంచి తాము దుఃఖపడుచుంటిరా! ఇంక వంత యావంతయు వలదు.

(తెరలో) ఏమయ్యా బ్రాహ్మణుఁడా? బండ్లను నన్నమును సిద్ధమైనవి. బకాసురునకు వేళయునైనది. రా! రమ్ము.

ధర్మ: అబ్బా! హృదయము జల్లుమనుచున్నది. తమ్ముఁడా! వేగము పోయిరా! ఆయుష్మంతుఁడా! వేగమ నీ పునర్దర్శన మగుఁగాక.

భీము: అన్నయ్యా! అమ్మా! నమస్కారము.

ఇద్దరు: దీర్ఘాయుష్యమస్తు. (అప్పుడు భీమసేనుఁడు నిష్క్రమించు చున్నాఁడు.)

ధర్మ: (విచారముతో) అమ్మా! తమ్ములారా!

చ. దనుజుని మల్లయుద్ధమున దారుణలీలను మ్రింద(ఁ)జేసి నా
యనుజుఁడె యేకచక్రపురమందు వసించెడివారిఁ బ్రోచునో
యనిమిషవైరిచేతఁ దెగి యారనిదుఃఖము మాకుఁ దెచ్చునో
యనుచును శాంతిలేక మదివ్యాకుల మందెడు నేఁడు వేమఱున్
అయినను నేమి చేయఁగలము?

కుంతి: కుమారా! భయములేదు, మధ్యాహ్నమైనది. భోజనకాల మతి క్రమించుచున్నది. రండు లోపలి కరిగి భుజింతము.

ధర్మ: అయ్యో! నాకన్నము మీఁద దృష్టిలేదు. ఐనను దమ్ములలసి యాకలిచెందుచున్నారు. పోదమురండు.

(అందఱు నిష్క్రమింతురు.)

---

# తృతీయాంకము

## రంగము 2.

ప్రవేశము : బకాసురుఁడు కాపురముండు చెఱువు గట్టు.

(అఱచుచు బకాసురుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

బకా : ఈ దినమున నాబ్రాహ్మణాధమునియింట నాకు వంతుగలదని నాతో గ్రామాధికారి పలికిపోయెను. ఆ నరాధముఁడింకను నా యాహారముఁ దీసికొనిరాఁడయ్యెను. ఆ యాహారము దెచ్చిన వాని నీవేళ చిత్రవధ చేసెదను. వానినేకాదు, తదీయకుటుంబము నెల్ల నీదినమున సంహరించెద. నా కాఁకలి యత్యధికముగా నగుచున్నది. హా! దుర్మార్గుఁడా! ఇంకను రాలేదుగదా ! హా చండాలా ! చూడు నీపని.

(భీమసేనుఁడు బండి యన్నముతోఁ బ్రవేశించుచున్నాఁడు.)

భీము : (తనలో) ఈ దురాత్మునకు మామూలుగానున్న స్థలములోనికి నీ బండిని దీసికొని పోవలెను. అదియునుగాక యీ పాపాత్ముని కహంకారవృద్ధి యగునట్లు వేళగూడఁ దప్పించితిని. ఇంక వీని

కంటఁబడెదను. అదుగో! అక్కడ మహాపర్వతాకారుఁడై యఱచుచున్నాఁడు. (అని యచ్చోటి కరుగుచున్నాఁడు.)

బకా : (చూచి) ఓరోరి మానవాధమా! ఇంత యాలస్య మేల చేసెదవురా? దురాత్మా ? మామూలు రేవుగాక మాఱురేవునకు బండిని దీసికొని రానేల ? ఇదిగో చచ్చితివి (అని మీఁదబడి గుద్దును.)

భీము : ఉండు నీ యాయువు మట్టమైనది. నన్ను నీవెన్ని గుద్దిన ను ఈ బండెఁడశనమును నీబదులు నేభక్షించినఁగాని యుద్ధంబునకు సిద్ధము గాను. నీకండకావరము నడచి దండధరుని పుటభేద నమున కప్పుడంపెదను. ఏకచక్రపుర హృదయసంతాపకరుఁడ వగు నీ మదము నదమదము గావించెదను. జపతప స్వాధ్యాయ పరులగు భూసురోత్తముల మాంసవశామేదఃపదార్థముల భక్షించి మత్తిల్లియున్న నీకొ్రవ్వు నడచెద (అని యాచమనము చేసి భుజించును.)

బకా : (మీఁదబడి గుద్దుచు) ఈ దురాత్మ్ముఁడు నా గుద్దులఁ దినుచు నన్నపుముద్దలఁగూడఁ దినుచున్నాఁడు. ఎన్నఁడును నొక్క గుద్దుకే ప్రతి నరాధముఁడును జచ్చుచుండెడివాఁడు. నేఁడు వీఁ డనేకముగ గుద్దులఁబడినను నెక్కడనో తగిలినట్లును, తనకుఁగాని యట్లును నిర్లక్ష్యముతో గుటుకు గుటుకున నన్నము మ్రింగుచే కాని కదలకున్నాఁడు. వీఁడెవ్వడో కడుదిట్టరి. వీనిని గెలువఁగలనా ? లేదా ? (ప్రకాశముగా) ఓరోరీ! నా కండ కావర మడచి యమపురమున కంపెడివాఁడవు నీవా ? యిదిగో యిప్పుడే చచ్చెదవు. (అని తన్నును.)

భీమ : (చేయి కడుగుకొని దండదెబ్బ కొట్టి) ఓరీ మూఢచిత్తా ! మను జాశనా ! మదీయభుజపంజరమునఁ జిక్కితివి. సింహాముఖ మునఁ జిక్కిన దంతావళము చందమున నీ మరణమునకే నేఁడు నా యెదుటఁబడితివి. పన్నగగళాంతర్గతభేకమ వైతివి. రారమ్ము. (అని యిద్దరు యుద్ధము చేయుదురు.)

బకా : ఈ దురాత్ముఁడే నన్ను కొట్టుచున్నాఁడు. అతఁడుకొట్టు దెబ్బలు నాకుఁ దగులుచున్నవి. నేఁ గొట్టుదెబ్బలు వీనికిఁ దగులనట్టె యున్నది. (అని వగర్చుచున్నాఁడు.)

భీము : ఇంకనిన్ను మరణము నొందించెద. నీ వెన్నెముక మోకాలం బెట్టి విఱిచినఁగాని నీవు చావవు (అని వెన్నెముక మోకాలంబెట్టి విఱిచి చంపును.)

బకా : (వగర్చుచు ప్రాణము విడుచును.)

భీమ : ఆ చచ్చితివిరా ! ఏకచక్రపురమున నీ దినమున నిశాచరబాధ తీరి నది. ఆ! చచ్చితివిరా ! మూర్ఖా ! (అని తన్నును) ఓహో ! బకాసురసేవకులారా ! ఏల నన్నుఁజూచి పాఱిపోయెదరు ? ఈ దినము మొదలు మనుజాశనము మానుఁడు. లేకున్న భీమ సేనుఁడు మీ యంతు చూడఁగలఁడు. ఓహో ! ఏకచక్రపుర నివాసులారా ! ఈ దినమునుండి మీరు నిర్భయచేతస్కులై తొమ్మనఁ జేయిడి నిద్రింపుఁడు. (అని వెళ్లును.)

రంగము 3.

ప్రదేశము. బ్రాహ్మణ గృహము.

(అప్పుడు ధర్మజార్జున, నకుల, సహదేవులు, కుంతి ప్రవేశింతురు.)

ధర్మ : ఆ ధ్వనిమాత్రము భీమసేనుని ధ్వనివలెనే యున్నది. నిశ్చ యము తెలియదు. నామనము తత్తర పడుచున్నది.

అర్జు : అన్నయ్యా! ఏ విషయమందైనను, తదేకధ్యాన చిత్తులగువార లకు, నా విషయమైన సంగతులు వినఁబడుచుండును. మనము భీమసేనునిపై ధ్యానము నుంచుటచే నెట్టిదైనను నాతని ధ్వనివలెనే యుండును. నిశ్చయింపలేము.

కుంతి : కుమారులారా! నాకు భీమసేనుని ధ్వనియే వినవచ్చుచున్నది.

సహ : అమ్మా! అన్నయ్యా! అదుగో మహారౌద్రాకారముతో శత్రు చ్ఛేదన మొనరించి మన భీమన్న యిటు వచ్చుచున్నాఁడు. అదుగో యిటు వచ్చుచున్నాఁడు.

ధర్మ : (లేచి) ఏఁడీ! ఏఁడీ! శత్రునిర్మూలనము చేసిన నా సహోద రుఁడు. తదవలోకనార్థమై నా హృదయము తత్తర పడుచున్నది.

కుంతి : బకాసురాధమ వధయొనరించిన మత్ప్రియ సూనుఁడేఁడీ!

సహ : అదుగో! ఇటు వచ్చుచున్నాఁడు. (అప్పుడు భీమసేనుఁడు ప్రవేశించును.)

ధర్మ : తమ్ముఁడా! వచ్చితివా! నన్ను దృఢాలింగనము చేసికొనుము (అని కౌఁగిలించుకొనును.)

భీమ : అన్నయ్యా! మదర్థ మీవఱకును మనః స్తిమితములేక విచా రించుచుంటిరి గాఁబోలు! ఇంక వంత యుడుగుఁడు.

కుంతి : కుమారా! నీ వాబకాసురు నిశ్శేషముగాఁ జంపితివిగా!

భీము : అమ్మా ! శత్రునిర్మూలనము జేయునపుడు భీమసేనుఁడు హత శేషముగూడ విలువనిచ్చునా ? ఏకచక్రపురమింక నపూర్వ సౌఖ్య మొందఁగలదు.

ధర్మ : తమ్ములారా ! అమ్మా ! ఈ యేకచక్ర నగరవాసులను భూసు రోత్తమ ప్రవరులయిండ్ల నన్నపానములఁగొని తదీయ ఋణ మున నుంటిమి. ఈ దినమున శత్రునిర్మూలన మొనర్చి వారిని బ్రోచుటచే, నా ఋణము దీరినది. ఇంక మనమీ నగరము విడిచి యెచ్చటకైన నను బోదము. అందులకీ గృహ యజమానుని కడ ననుజ్ఞ గొందము రండు.

కుంతి : కుమారా? అట్లాచరించుట లగ్గు. కలకాలము నొక్క నగరమున వసించుట మేలుగాదు. ఇంతకన్నను సుభిక్షమగు నింకొక దేశ మున వాసము చేయుదము.

భీమ : (ఈర్ష్యతో) పరిపాలన మొనరింప వసుంధరా చక్రము లభింప నేరదుగాని భిక్షార్థమరిగెడు మనకు దేశము దొరకదా! పాండు మహారాజ పుత్రులమైన మన కెంతదశ సంప్రాప్తమైనది. అహా ! హా ! ఏమి ?

ధర్మ : కాలవశమున కేమి యొనరింపఁగలము ? కావున నాపై నాగ్రహిం పక నా వెంట నంటి రమ్ము.

భీమ; దేవర యాజ్ఞా వ్యతిరేకం బెన్నఁడొనర్చితిని! అట్లే వచ్చువాఁడను. (తెరలో) ఏమీ ! పెక్కుసారులు పిలిచినను బలుకకున్నారు ? ఎవ్వరింటిలో ! తలుపు తలుపు.

ధర్మ : ఎవ్వరో పిలుచుచున్నట్లున్నది. పోయి కనుగొనుము సహదేవా ! వారిని నీవు పోయి తోడ్కొనిరమ్ము. (అప్పుడు సహదేవుఁ డరిగి బ్రాహ్మణునితోఁ బ్రవేశము.)

ధర్మ : మహాత్మా ! నమస్కారము.

కుంతి : దేవా ! దేవర జన్మకారణమున నే దేశము పవిత్రమయ్యె. భదివత్పాదారవిందము లే విషయముల ధన్యత నొనర్చి యింక నేభూములఁ బావనము చేయఁదలఁచెను. తమ వాసమగు సీమకు మహీనాయకుఁ డెవ్వరు ? తమ్ము దేశాటన మొనరింపఁ జేయు చున్న య మ్మహాకారణ మేది ?

బ్రాహ్మ: అమ్మా ! నా నివాసము పాంచాలదేశము. మాయేలిక ద్రుపద మహారాజు. అతఁడు తొల్లి యాజోప యాజులకృప పాండవ మధ్యముఁడగు నర్జునుని బెండ్లాడం బుత్రికయు, గుంభ సంభవుఁబరిమార్చఁగల పుత్రునిఁబడసెను. కాని యీ పాండ వులు లాక్షాగృహ దహనమునఁబడి మడిసిరని విని ప్రతిజ్ఞాభంగ మగునని చింతించి వారిజాడఁ గనుగొన బ్రాహ్మణుల నానాదేశ ముల కంపెను. నేనును వారలలోనివాఁడను. నేనీగ్రామము వచ్చితిని. మీయింట బస యిచ్చెదరా ?

కుంతి: స్వామీ ! మేము గృహయజమానులము గాము. మేమును మీ వంటి వారలమే. లోపలకరిగి యింటివారి నడుగుఁడు. (అప్పుడు బ్రాహ్మణుఁడు పోవును)

కుంతి: కుమారా! మన మాదేశము పోదము. ఈ యర్జునుఁడు ద్రుపద పుత్రికను బడయఁగలఁడు. రండు పోదము. (అందఱును నిష్క్రమింతురు)

(తృతీయాంకము సమాప్తము)

———

# చతుర్థాంకము

## 1 వ రంగము

ప్రదేశము. ద్రుపదుని సభామంటపము.

(అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు, ద్రౌపది. చేటియు బ్రవేశించుచున్నారు)

ధృష్ట: అమ్మాయీ! యాజ్ఞసేని! మన తండ్రిగారు నిన్నుఁ బాండవ మధ్యమున కీఁదలఁచి ప్రతినయొనర్చి తదన్వేషణార్థమై యనేక మహీసుర సత్త్రములఁ బంపెఁగాని యింతవరకా పాండవులు నగపడరైరి. అందుచే నీమహా మత్స్యయంత్రింబు గల్పించె. ఇదేచూడు. అంతరిక్షమార్గముననున్న యమ్మహాయంత్రములోని మత్స్యము. ఇదె ధనుస్సు. గంధమాల్య సుగంధలేపనములతో నీ యగ్నిహోత్రము చెంత నున్నది. అచ్చట నైదు బాణమ్ములు గలవు. ఆధనుస్సులోపెట్టి యీ పంచబాణమ్ములతో నీయంత్రిస్థిత మత్స్యము నేసిన వీరుఁడే నీకు భర్తకాఁగలడు.

ద్రౌపది: అన్నయ్యా! అది యెల్లఁజూచితిని. (తనలో) నే నదృష్టవంతురాలనైన నప్పాండవ మధ్యముఁడు మాఱురూపమున వచ్చి యీ యంత్రము తెగవేయరాదా! ఏ జాతి మానవుఁ డీయంత్రము తెగవేయునోగదా! అయినను జనకుఁ డొనర్చిన ప్రతిన తీరవలెఁగదా!

ధృష్ట: యాజ్ఞసేనీ! భవత్స్వయంవరార్థులై వచ్చిన నానాదేశ రాజకుమారవర్గముల నెఱింగించెద నాకర్ణింపుము. అల్లదె! సభామంటప ప్రాగ్భాగంబునఁ జూడుము. దుర్యోధన, దుశ్శాసన

దుర్మర్షణ, విందానువింద, కర్ణ, వికర్ణ, దుర్ముఖప్రముఖ ధార్తరాష్ట్ర వర్గములు సుఖాసీనులై యున్నవారు. అదె దక్షిణ దిగ్భాగంబునఁ గనుఁగొనుము ! అశ్వత్థామ, సోమదత్త, భూరి శ్రవః, శకసేన, జయద్రధాదులు గూరుచున్నవారు. అదిగో పశ్చిమభాగమున శల్య, విరాట, జరాసంధ, గాంధార వసుంధరా ధరులును, నకూ్రర, సాత్యకి, సాంబ, సంకర్షణ, శ్రీకృష్ణ బల దేవాది యాదవ ప్రవరులును నాసీనులై యున్నవారు. ఉత్తరదిశ సుమిత్ర, సుసేన, చంద్రసేన, సముద్రసేన, సూర్యసేన, సేనా బంధు, శిశుపాలి, దంతవక్త్ర, పౌండ్రక, వాసుదేవ, ప్రముఖ నానామహీనాయకులు నున్నవారు. ఇందేమహాపురుషుఁడీ మత్స్య యంత్రముఁ దెగనేయు నాతండే నీభర్త.

ద్రౌపది: (తనలో) సర్వప్రపంచమునఁగల రాజకులము లన్నియు వినఁబడెను గాని పాండవాన్వయమెందును విననై తినిగా ! (ప్రకాశముగా) అన్నయ్యా ! ఆ రాజకుమారుల నందఱి నవలోకించితిని.

ధృష్ట: సరే. ఓ చతురంభోనిధి మేఖలావలయిత విశ్వవిశ్వంభరా పరిపాలనధౌరేయ మహామూర్ధాభిషిక్తులారా ! ఓహో ద్రుపదరాజ పుత్రికా స్వయంవరాగత రాజకుమార వర్గంబులారా ! మీరందఱు నాలకింపుఁడు. అంతరిక్షస్థితమగు నీ మత్స్య యంత్రరాజము నేమహాత్ముఁడీ బాణపంచకమున నేయు నట్టివాఁడీ యాజ్ఞసేనికి నాధుఁడై యుండుఁగాక ! అమ్మాయీ ! ఈ రాజసంఘంబు లరుదెంచిన వార్త నేఁబోయి జనకుల కెఱుఁగఁజెప్పెద.

ద్రౌపది: అన్నయ్యా ! చిత్తము. అట్లేపోయిరండు.

చేటి: చెలీ! యాజ్ఞసేనీ! మీ యన్నగా రంతఃపురమున కరిగిరి. అరుగో! రాజకుమారు లొక్కరొక్క రరుగుదెంచుచున్నారు చూడుము.

ద్రౌపది: రానిమ్ము! జనకులట్లు ప్రతిన చేయుటచే బాహాబల శోభితుండగువాఁడొవిక్క నరుఁడు దానినేసి నన్నుఁ గొనఁగలఁడు.

చేటి: ఆనరుఁ డేయ నీ మనోభీష్టము నెఱవేఱుఁగాక! (అప్పుడొక రాజు ప్రవేశించును)

రాజు: ఆహాహా! ఈ మత్స్యయంత్రము నేనెటులైన భేదించి యీ ద్రౌపదిని వివాహమాడ వలయును. (అని ధనువును చూచి) ఆహా! దీని నెత్తుటకు నా బలము చాలదు. అవమానము పడుట కంటె నూరక పోవుట మేలు. (అనివెళ్లును) (రెండవ రాజు ప్రవేశించును)

రెండవరాజు: పహవ్వా! సింధురాజనైన నా కీ మత్స్యయంత్ర మొక్క లెక్కయే! అంతయు సిగ్గు పడునట్లు మత్స్యయంత్రము నే గొట్టెద. (అని ధనువుముట్టి) అబ్బా! ఇది యింత భారముగా నుండునన్న సంగతి మొదటనే తెలిపిన యెడల రాకేపోదును. యంత్రంబు భేదింపలేక సిగ్గు పడుటకంటె బాణము ఏవలక పోవుటయే మేలు. అట్లుచేసెదను. (అని పోవును) (మూఁడవ రాజు ప్రవేశించును)

మూడవ రాజు: మద్రదేశాధీశుఁడనై, యస్త్ర శస్త్రవిద్య నసహానుఁడనగు నాకు నావిషయమై సందియము గల్గుచున్నది. లోకమున క్షత్రియులలో భీష్ముఁడును, బ్రాహ్మణులలో ద్రోణుఁడును గాక నాకంటె శస్త్రవిద్యయందు ఘనుఁడు లేఁడు, వ్రతము బూనుట

చేతను, వృద్ధుఁడగుటచేతను. భీష్ముఁ డీకార్యమునకు రాఁడు. ద్రోణుఁడు బ్రాహ్మణుఁడగుటచే నాతఁడును రాఁడు. నాకంటె నధికులగు భీష్మద్రోణు లీ కార్యమునకు రానప్పు డింక నేనే దీని నేయవలెను. వహావ్వారే! వహావ్వా! ఎత్తిన నీధనువునే యెత్తవలయును? కొట్టిన నీయంత్రమే కొట్టవలయును. అల్లుఁడనైన ద్రుపదునకే యల్లుఁడను గావలయును. వృథా ప్రసంగమేల? యంత్రమును గొట్టెద? (అని బాణమును విడువ నది తగులదు) అయ్యో! ఏమి నా దురదృష్టము? (అప్పుడు దుర్యోధన కర్ణులు ప్రవేశించుచున్నారు)

చేటి: (తిరిగిచూచి) అదేచూడు! ఒక్క రాజన్యకుమారుఁడు మిత్ర సమేతముగా నీ యంత్రరాజము చెంత కరుదెంచుచున్నవాఁడు. ఇటుచూడుము.

ద్రౌపది: సఖీ! ఆరాజకుమారుఁడెవ్వఁడు? తత్సమీపమున నున్నయా దినకరప్రతి మానతేజోధనుఁ డెవ్వఁడు?

చేటి: చెలీ! ఆతఁడే ధార్తరాష్ట్రాగ్రజన్ముఁడు. సుయోధనాభిధానుఁడు అతనిచెంత నున్నవాఁడు సూతకుల సంజాతుఁడగు కర్ణుఁడు. ఈ కర్ణునకును, దుర్యోధనునకును దేహములు రెండు గాని ప్రాణమొక్కటియే యని విందుము.

ద్రౌపది: (అసూయతో) పాండురాజాన్వయ నిర్మూలన మొనరించిన మహానుభావుఁ డీతఁడే గదా! ఈతని దురాచరణములకు సహాయుఁడీ అంగరాజే గదా! వీరిరువురిలో నేరినైన వివాహ మాడుట కంటె మఱియేవురనొక్కమారు పరిణయ మగుట లగ్గు. అయినను—

కర్ణు: రాజా! ఈ సభామంటపము రమణీయతఁ జూడుము.

దుర్యో: అంగరాజా! ఔను నేత్రోత్సవముగానున్నది. సభారమణీయత కేమిగాని దాని నలంకరించుచున్న యాయప్సరఃకాంతా రత్నమును గోరికదీరఁ జూడుము.

కర్ణు: రాజా! దానిని వేఱుగాఁజూడనేల? అసాధారణ బాహుబలులమైన మనయిరువురిలో నొక్కర మక్కన్యకా రత్నము నెత్తైన వివాహమాడఁగలము. ఆమె మన ధనమే.

దుర్యో: అంగరాజా! లెస్సగా నూహించితివి. ఆమాట సత్యమే. అది యబలులగు నీచరాజులకు దుర్లభము గాని మనకు దుర్లభమైన కార్యము కాదుగదా!

కర్ణు: మిత్రుఁడా! దురాత్ములైన పాండునందనులు లాక్షాగృహమందు బడి మృతి నొందినఁగాని లేనిచో ద్రుపదుఁడీ కన్యకారత్నమును నా పాండవ మధ్యముఁడగు నర్జునున కిచ్చి పెండ్లి చేసి యుండును.

దుర్యో: అవును. వారు మృతి నొందుటచే నీతఁడు మత్స్యయంత్రము నొక్కదానిని గల్పించెను. అది మనకే మేలు. ఏలయన నా లక్ష్య మన్యరాజన్య దుర్లభము. మనకే సాధ్యము. అందుకు ముందుగ నేనీ మత్స్యయంత్రము నేసెద. (అని దగ్గఱకుఁబోయి (మత్స్యయంత్రమును, ద్రౌపదిని జూచును)

ద్రౌపది: చేటీ! మహా మూర్ఖాగ్రగణ్యుఁడగు నీ దుర్యోధనుఁడు ధనుర్ధర్శనమున కరుగుచున్నవాఁడు. ఈతఁడు జయింప లేకపోయిన నయ్యంబికా దేవతకు నొక్క యుత్సవము చేయించెదను. చెలీ నీవును నట్లు మ్రొక్కవే.

తే॥గీ॥ నేల యీవిన లాగున నేల తేండ్లు
వచ్చియున్నారు నా స్వయంవరముఁ జూడ
పొందు నరనాథ సుత సింహపంచకంబు
కానఁబడదయ్యె నాదోష కర్మమేమొ.

తల్లీ పార్వతీ!
ఇప్పుడీ సుయోధను వేగ్రిటు తప్పెనేని
అంగరాజున కపజయ మయ్యెనేని
మచ్చికలు సేయఁ బార్థుండు వచ్చెనేని
కడము భక్తి నీ కెన్నేని కొన్కలిత్తు.

దుర్యో: (తనలో) అహో హో! ఏమి యీ సుందరి యందము! ఇది యన్యరాజన్య కుమారుల వశముగాకుండ నేనే పరిగ్రహించెద. దైవము నాకేల యనుకూలుఁడు గాకుండును? ఈమె సౌందర్య మెన్ని సారులు చూచిన చూడనే బుద్ధియగుచున్నది. ఈ ధను వును స్పృశింపను మనస్సు రాకున్నది. అయినను నొక్క ముహూర్తము లోపల నస్మద్ధనముగానున్న యీజవ్వనికై యివ్విధ మున విచారింపనేల? ఆ మత్స్యయము నిప్పుడే తెగనేసెద. (అని దగ్గరకుఁబోయి) నేను గదాయుద్ధధౌరేయుండనే గాని ధనుర్విద్యాకుశలుఁడనుగాను. దీనిచే నీయంత్రము నేయనేర్తునో లేదోగదా! ధనుష్టంకారమైన నాచరింపలేనప్పుడు సకల రాజకుల ములలో నవమానము వాటిల్లుఁగదా!

కర్ణు: మత్ప్రియ మిత్రుఁడగు ధార్తరాష్ట్రాగ్రజన్ముఁడు ధనువును మో పెట్టనైనఁజాలఁడని నేనూహించెద. కారణ మేమన నది ధనుర్వి ద్యాకుశలులకుఁగాక యన్యులకు దుస్సాధ్యము.

దుర్యో: అయినను నేమి కానున్నదో కానిమ్ము. ఈధనుర్బాణములతో దీనిఁ దెగవేయ యత్నించెద. (అని విల్లుముట్టి) అబ్బా! ఇది

దుర్వార దోర్బల ధుర్యుఁడగు దుర్యోధనునికి నాకే యింత భార మని తోఁచుచున్నది. ఇంక నితరుల కెంతభారమోగదా! అందు చేతనే సమస్త రాజన్యకుమారవర్గములు నట్లు లజ్జచే నరిగిరి.
(అని విల్లుమోపెట్టి)

చ. ఘనతర మత్స్యయంత్రమను కార్ముకమిప్పుడె యెక్కుపెట్టి యీ
విసిశిత బాణమూలమున వేయఁగ లేనె క్షణంబులో సుయో
ధనుఁడను నాకు దుర్లభము ధారుణి నున్నదె? గాన నేవ య
వ్వనజ దళాయతాక్షి నిటు వైభవ మందఁగఁబెండ్లియాడెదన్.

(అని బాణమువేయ నది తగులదు)

ద్రౌపది: చెలీ! చూడు! మదీప్సితము నిర్విఘ్నముగానీడేరినది. ఆదుర్యోధన ముక్తంబగు నంబక మంబికా కటాక్షమున నన్యమార్గాను వర్తియై మత్స్యయంత్రము దరికైన రాకపోయెను.

చేటి: అవును. మన మంబికా దేవతకు నుత్సవము తప్పక చేయించ వలెను.

దుర్యో: (విచారముతో) ఆహాహా! ఎంతమోసమయ్యెను. అశేష రాజ లోకములో మహావీరుఁడనై నేనేల రావలె. వచ్చితినయ్యా! ఆత్మబలసామర్థ్య పరిజ్ఞాన విహీనుండనై దీనికేల దొరకొన వలెను? ఈదుర్వారపరాభవము సహింపనలవిగాకున్నది. అందు చేతనే నయఁ డాత్మసామర్థ్యము నెఱుఁగవలెనని పెద్దలు చెప్పు దురు.

మ. ఇది నాశక్యమె? దీనిఁబూనఁదగునే? యేమౌనటంచెంతయున్
మది తర్కింపక దుస్తరంబు లొనరింపం బూను మర్త్యుండు హా!
యిదె దుర్యోధనుఁ డంధుచందమునఁ దానెంతేని మోసంబునన్
మది దుఃఖంబును బొందు నవ్వ సకలక్ష్మామండలాధీశ్వరుల్!

అహాహా! మదీయాకుంఠ కంఠీరవపరాక్రమ మెందరిగెనో? అయినను ధనుర్విద్యా కుశలత నెఱుఁగని నాకు బరాభవము నూతనముగాదు.

మ. ద్రుపదక్ష్మాధవుఁబట్టి తెమ్మనుచు మున్ ద్రోణుండు కౌంతేయులన్
నృప పుత్రావళి నన్ను నాయనుజుల న్నైయ్యంబునం బంపఁగా
నపుడేనోడఁ బృథాసుతుల్ గెలువరే యేతద్విభున్ గ్రొత్తగా
నిపుడీ యద్భుతమేల నాఁడెతెలిసెనేగా నాదు దర్పోన్నతుల్.

అయినను నాకదియొక కొఱఁతగాదు. సారకార్ముక కళాధౌరేయులగు రాజపుంగవు లనేకులు దీనిని స్పృశింపనైన నోపని సమయమున ధనుర్విద్య నెఱుఁగని వాఁడను. గదావ్యాపార పారీణుఁడను నగు నేను మార్గణముల సేయుటయే శ్లాఘాపాత్రము.

[అప్పుడు కర్ణుఁడు దగ్గఱకు వచ్చుచున్నాఁడు.]

కర్ణు: [తనలో] మదీయ ప్రియసఖుఁడు మత్స్యయంత్రంబు భేదింపలేమికి మనమున ఘనముగ వగలఁ బొగులు చున్నట్లున్నది. ఆతని చింత నాశాంత వచనములఁబాపెద.

దుర్యో: నేనీ మత్స్యయంత్రము భేదింపలేమికి వగచుచున్నదానికంటె శ్రీకృష్ణ సాత్యకి బలరామాది యాదవవీరులు నన్నుఁబరిహాస మొనరింతురని యెక్కువగా చింతిల్లు చున్నవాఁడను. అయినను నంగరాజు లేఁడా!

కర్ణు: మిత్రుఁడా! దుర్యోధనా! ధనుర్విద్యా పరిశ్రమ మధికముగాలేని నీకీమత్స్యయంత్రవిషయమునఁజింత యేల? దీనిని నేనేసి నీమన స్తాపముఁ బాపఁగలను [వెళ్ళి ప్రయత్నించి విఫలుఁడగును?] మిత్రుఁడా ఈమత్స్యయంత్రము సరిగ నమర్పఁ బడలేదుసుమా! లేనిచో నాప్రయత్నమున నే విఫలప్రయోజకుఁడఁగాను.

దుర్యో: అవును. దానిచేతనే స్వయము బరాజయమునొందితివి. జ్ఞాపకము చేసితివి. నీమాటలు సత్యములు కాని శ్రీకృష్ణాదులు మనలఁ బరిహసింతురు గదా యని నాకు సందియము వొడమెడును.

[అప్పుడు శ్రీకృష్ణుఁడు ప్రవేశించును]

కర్ణు: మిత్రుఁడా! అదే మనలఁ బరిహసింపఁదలఁచి వాసుదేవుఁడిట వచ్చుచున్నాఁడు. మనకు తటస్థమైన పరాభవ మొకయెత్తు. ఈతని చతురోక్తులకు గుఱియై పరిహాస పాత్రులమగుట యొకయెత్తు.

కృష్ణు: [తనలో] అంగరాజుకూడ నీకార్యమున నెఱవేఱఁ డయ్యెను. ఇది నిశ్చయముగా నప్పాండవ మధ్యముని కొఱకే యాగి యున్నది. వారీ యశేష బ్రాహ్మణ కులములో నుండకమానరు. ఇంకఁగొంత సేపటికినైన నే వారల నానవాలు పట్టెదను. కాని యీ సుయోధనుని యభిప్రాయ మెఱుఁగవలెను. [ప్రకాశముగా] బావా! దుర్యోధనా! ఉత్తమ క్షత్రియ వీరుఁడవై ధనుర్విద్యా ప్రవీణుఁడవైన, నీవీ యుద్యమమున నెఱవేఱవైతివి. అది యొక్క యాశ్చర్యమే: నీవేమి? అంగరాజుకూడ నీకార్యమున నప్రయోజకుఁడయ్యె.

కర్ణు: మాధవా! ఈమత్స్యయంత్రము సరిగా నమర్పఁబడలేదు.

దుర్యో: అంగరాజు మాటలు సత్యము. లేకున్న మేమట్లుగాము.

కృష్ణు: నాట్యకళా ప్రవీణతలేని వేశ్య మృదంగమును నిందించునట్లు మీమీ బలహీనతలు చెప్పుకొనక మత్స్యయంత్రమును నిందించు చుంటిరి. అదిగాక బావా! ధార్తరాష్ట్రా! ఓడతోఁగట్టినయోడ చందంబున నీవును గర్ణవాక్యము నవలంబింతువు.

దుర్యో: వాసుదేవా! నీపరిహాస వాక్యములకేమిగాని నిజముగా నాకీ ద్రౌపది యం దనురాగము లేదుసుమా!

కృష్ణు: (నవ్వుచు) అనురాగముండిన మాత్రమెట్లు లభించును. అభావ విరక్తిగాఁబోలును.

కర్ణు: (తనలో) ఈమాధవుఁడధికముగ నధిక్షేపించుచున్నవాఁడు. వీనిని మాఱువాక్యములతో నన్య ప్రసంగమునకు దింపెదను. (ప్రకాశ ముగా) మాధవా! సకల ధనుర్ధరులును నవజయమునొందిరి. ఇంక నీయంత్రము నేయఁగలవారెవ్వరు?

కృష్ణు: అంగరాజా! కర్ణా! లోకమున నీకంటె బలాఢ్యులు లేరనియా యూహించుచుంటివి. అట్లుగాదు ఈ మహాసంఘమునుండి యొక్క నరుఁడువచ్చి యీక్షణము యంత్రభేదన మొనరింపఁ గలఁడు.

దుర్యో: మిత్రుఁడా! అంగరాజా! ఎవ్వరోమహీసురముఖ్యుఁడు దట్టమగు దట్టీ కటిప్రదేశమునఁగట్టి బ్రాహ్మణ మధ్యమునుండి యిట వచ్చుచున్నాఁడు.

కర్ణు: మిత్రుఁడా! ఆ మహీసురుఁడు కేవలము మూర్ఖాగ్రేసరుఁడు. కానిచో ధనుర్ధరులగు పార్థివోత్తములకు దుర్లభంబగు నీకార్య మాతఁడేల పూనును.

కృష్ణు: ఓ మహాపరాక్రములారా! ఆదినుండియు మీ మహాగర్వమే మిమ్ముఁజెఱచినది. మీరే మహాబలులా! మీ రొనరింపలేని కార్య మెవ్వరొనరింపలేరేమి? ఆ! చూతము సారకార్ముక కళాధుర్యు లగు క్షత్రియులకు సిగ్గువచ్చునట్లీ మహీసురసత్తముఁడు దాని యందుఁ గృతకృత్యుఁడగునట్లే తోఁచుచున్నది.

దుర్యో. అట్లేచూతములే! నీమాటలకేమి?

కర్ణు: అంతటి యాశ్చర్య మీయుగమున నుండదు.
(అప్పుడు బ్రాహ్మణ వేషముతో నర్జునుఁడు ప్రవేశించును)

ద్రౌపది. నెచ్చెలీ! కర్ణదుర్యోధన ప్రయత్నానంతరమున ధనుర్ధరుఁడిం కొక్కఁడు రాకుండుటకుఁ గారణమేమి?

చేటి: రాజపుంగవులెల్లరు నుడిగిరి. అల్లదె బ్రాహ్మణోత్తము డొక్కఁడు వచ్చియున్నవాఁడు చూడు!

ద్రౌపది: ఏమీ! బ్రాహ్మణుఁడా వచ్చుచున్నది! ఇట్టి మహాకార్యమునకు సాహసించు వీరుఁడు విప్రవేషమునను‌న్న క్షత్రియుఁడై యుండ వచ్చును. కాకున్నవిట్లొనర్చునే?

చేటి: అన్నియుఁ దేటపడఁగలవు. కొంచెము చూడు!

అర్జు: (తనలో) రధికవరుల కసాధ్యమైన యీకార్యనిర్వహణము నా చేతనగునా? అల్లదే! నేత్రముల కపూర్వపర్వమొనర్చుచు సకలలోకారాధ్యుఁడును జగన్నాధుఁడునగు స్వామి దేవకీనందనుఁ డెట్టయెదుటనున్నవాఁడు (ప్రకాశముగా)

మ॥ జనముల్ మెచ్చఁగ మత్స్యయంత్రమును నే సాధించి పాంచాలనం
దన పాణిగ్రహణమ్ముసల్పి యమితానందంబునుం గాంతు నో
ధనువున్మట్టఁగలేకచన్న నరనాధ వ్రాతముస్గూడి యే
నును లజ్జందలవంచి యేఁగుదునొ?దీనుండట్లు చింతించుచున్

తే॥ గీ॥ చేరి యాజోపయాజుల సేవఁజేసి
కుంభసంభవుఁ గెలిచెడి కొడుకునొకని
నన్ను బెండ్లాడు కూఁతునుగన్నవాఁడు
భవ్యగుణుఁడైన పాంచాలవల్లభుండు.

( ద్రౌపదిని జూచి )

మ॥ గరిమన్ గుండమునన్ జనించె నిదియేగాఁబోలు, మౌనీంద్రు స
త్కారుణన్ పార్షదునోముపంట యిదియేఁగా బోలు, రాజన్యుఁడ
క్కఱ యంత్రింబు నొనర్చె దీనికొఱకేకాఁబోలు! నాభాగ్యమె
క్కరణిన్ నిల్చునొతెల్పునట్టి దిదియేకాఁబోలు: నేఁడిచ్చటన్॥

ఆ॥ వె॥ మావి చిగురుకన్న మల్లెమొగ్గలకన్న
గలువరేకుకన్నఁ గలుకుమీరి
యింతివాలుచూపులెక్కుడు పనిచేయుఁ
జెఱకువింటివాని చెయిదములకు.

ఆ॥ వె॥ తుంటవింట మరుఁడు తొడిగి యేసినయమ్ము
తాకవచ్చు నొండెఁదప్పవచ్చుఁ
గొమ్మవాడిచూడ్కి గుఱిచూచి కొట్టినఁ
దగులవలయు గుండె పగులవలయు.

కర్ణు: మిత్రుఁడా దుర్యోధనా! ఈతనినెందో చూచినట్లున్నది?

దుర్యో: దానకళా ప్రవీణుఁడవగు నీచేసత్కారములు వడసిన వారనేకులు
గలరు. వారిలో నెవ్వఁడై యుండునో కదా!

కృష్ణు: ఈ మహానుభావుఁడగు మహీదేవునెందో చూచినట్లున్నది.

అర్జు: (తనలో) పాతకస్వరూపుఁడగు ధార్తరాష్ట్రాగ్రజన్ముఁడును, సూతకులాధముఁడును 'నదేమాధవ సరసనున్నవారు. ఛీ! వీరి వదనదర్శనము పాపహేతువు.

కృష్ణు: ఈతఁడెవ్వరై యుండవచ్చును? చూచిన జ్ఞాపకమున్నది. వేగముగ నానవాలు పట్టలేకుంటిని.

కర్ణు: మహీసురసత్తమా! అతివేగమున విప్రసంఘములవెడలి తామిచ్చోటికి రాఁగారణమేమి?

అర్జు: భవదసాధ్యమగు వీరకర్మము నిరభ్యంతరముగ నొనరింప నరుదెంచితిని.

దుర్యో: విప్రుఁడా! ఏమీ! ఈవీరకర్మమొనరించుటకే వచ్చితివిగా! నీ సంగతియేమి? నీవేమి? లజ్జింపక యెటువచ్చితివయా!

కర్ణు: బ్రాహ్మణుఁడా! ఇది యజ్ఞశాలగాదు, క్షత్రభవనము; జుట్టుఁ బాయసాన్నముగాదు, ధనుర్వ్యాపారము, దండముగాదిదిఘనకార్ముకము; దర్భలుగావివి బాణములు; సంభావనలిచ్చెడు గృహమని మఱచివచ్చితివి గాఁబోలు! పో! పొమ్ము.

అర్జు: ఓరీ! మూర్ఖుఁడా! సూతకులసంభవా! చాలు! చాలు! నీవింక నూరకుండుము. నీవప్రజ్ఞనేనెఱుఁగనా?

కృష్ణు: అంగరాజా! దుర్యోధనా! తపోధనులగు విప్రులతోఁద్వారతమ్యము లెఱుఁగక మాటలాడుట శ్రేయముగాదు.

దుర్యో: అంగరాజా! ఈమహామూర్ఖుఁడు నిశ్చయముగా నీకార్యమునకు దొడఁగునని యెంచుచుంటివా? ఉత్తమరాజపుంగవులతో సరిగ

ధనుస్పర్శనముజేసి బ్రాహ్మణులచేత స్తోత్రములు పడయఁదలఁచి వచ్చెను. వీని మదము సదమదముగావింపవలె రమ్ము.

కర్ణు: నిక్కము! పోదమురమ్ము.

అర్జు: (తనలో) దురాత్ములారా! నాపై యుద్ధమునకు సిద్ధపడుటయుఁ జచ్చుటయు నొక్కటే పొందు.

కృష్ణు: ఆహా! హా! ఏమీ ఈదినము తద్దయుసుదినము. ఈతని రూపరేఖా వైఖరులవలోకింప పాండవమధ్యముని బోలియున్నవాఁడు. లాక్షాగృహదహనమునుండి ప్రాణములు దక్కించుకొనివచ్చిన యదృష్టవంతులగు పాండునందనులఁజూడఁగంటిని.వీరి నందఱ నొక్కసారి దృఢాలింగనము గావించుకొనుటకు పది చేతులున్న బాగుండునుగదా! అదుగో! ఆదెస రత్నస్తంభ సామీప్యమునఁ బాండవులు నిలిచియున్నవారు. ఈయర్జును నిటపలుకరించిన మోసమగును. కావున నేనీ పాండవులవార్త బలదేవాదుల కెఱిఁగించెద. నాసంతోషము పట్టఁజాలకున్నాను.

దుర్యో: ఓ మూర్ఖ బ్రాహ్మణుఁడా ! ఏల మదాంధీభూత చేతస్కుఁడవై నీతి విడిచి మముబోటి రాజహంసములతోఁ బోరాడఁదలఁచెదవు? శరణాగత రక్షణ బిరుదాంకులమగుటచే శరణమంటివేని విన్ను విడిచెదము. లేకున్న విడువము.

కర్ణు : మిత్రుఁడా ! ఈతని నింక విడుచుటెప్పటిది ?

అర్జు : ఓరీ మూర్ఖుఁడా ! దుర్యోధనా ! ఓరీ కర్ణుఁడా ! మీరు విడుచునది మీ ప్రాణములు; అంతకంటె నేమియుఁగాదు.

దుర్యో : అఖండ మహీమండలాఖండలుండనైన నేనెక్కడ ? పాఱుఁ బోతవైన పాఱుఁడవు నీవెక్కడ ? ఛీ ! నీతో యుద్ధమొనరింప మా రాచతీవికి లోపము.

అర్జు : ఓరీ ! గాంధారేయాధమా ! పాపా ! దురాత్మా ! నీ బాహుపరాక్రమమును, నీ శక్తియు, నీ మత్స్యయంత్రభేదన సమయముననే యెఱిఁగితిని.

ఆ॥ వె॥ పాలసంద్రమందు బడబాగ్ని వడువునఁ
జందమామయందుఁ గందులాగు
పరమపావనమగు భరత వంశమునందుఁ
బుట్టరాని నీవు పుట్టినావు.

దుర్యో: ఓరీ మూర్ఖుఁడా ? నీవేమెఱిఁగితివిరా ?

అర్జు : ఓరీ ! కులపాంసనా ! ఇచ్చటికేలవచ్చితివిరా ? సంపెంగ తైలము రాసి పెంచిన వాసిగల నీ మీసముల వేసము వీక్షించి యీ ద్రౌపది నిన్ను వరించుననని యిచటికరుదెంచితివా ? లేక దుర్మంత్రి తంత్రప్రజ్ఞాదక్షుఁడగు సౌబలు మేనల్లుఁడవని నిన్ను మోహించుననని వచ్చితివా ? పాండునందన నిర్మూలనమునకు సహాయుఁడగు పాపాత్ముఁడగు నంగరాజు ప్రాణస్నేహితుఁడ వని నిన్ను వలచునని యేఁగుదెంచితివా ? దుష్షేన ప్రముఖ నీచ సహోదరుల కగ్రజుఁడవని నీయందనురాగము గల్గునని వచ్చితివా ? సిగ్గులేక యేమనివచ్చితివి ?

తే॥ గీ॥ మానహీనుండు శకుని నీమేనమామ
తులువ దుశ్శాసనుఁడు పైఁ దోఁడునీకు
సిగ్గుమాలిన కర్ణుండు చెలిమికాఁడు
నీకుసన్మార్గమెటులబ్బు నృపకుమార ?

దుర్యో: పాపమా! నీవేమో బ్రాహ్మణుఁడవనియు నిన్ను వధియింకరు యెడలఁ బాపము వచ్చుననియు బ్రహ్మహత్యా పాతకము గంచిన గలదనియు వలదని యుపేక్షయొనరించిన మైమఱచి కాఱు మాటలు పేర్లిలనారంభించితివి. ఇఁక నీపసచూతుము! రా!

ద్రౌపది: అయ్యో! చెలీ! ఈ రాజులందఱు విష్కారణముగా నీ బ్రాహ్మణోత్తమునిపైఁ బోవుచున్నారు. అదే చూడు! దుర్యోధనుఁడు యుద్ధసన్నద్ధుఁడై రారమ్మని పిలుచుచున్నాఁడు. ఈ బ్రాహ్మణుఁడెట్టి సాహసియోకాని వెనుదీయక పోవుచున్నాఁడు.

చేటి: ఈతడు క్షత్రియుఁడు. ఈతఁడు బ్రాహ్మణుఁడు. ఇరువురలో నెవ్వరు గెల్తురో చూతము. ఉండుము.

అర్జు: ఓరోరి! చండాలుఁడా! భరతకుల పాంసనా! ఐరావత ప్రతిమాన భద్రికల బారోహణముచేసి చారు నవరత్న స్థగిత కిరీటము శిరోభాగమున ధరియించి హారకేయురాద్యనేక భూషణ భూషితుండవై హస్తినాపురవీధుల సంచరించుట యనుకొంటివా? లేక జాత్యంధుండగు తండ్రిని బ్రేరేపించుట యనుకొంటివా? లాక్షాగృహమునఁ బాండునందనులఁ జంపించుట యనుకొంటివా? వారలకు విషభోజనములిడి సర్పములచేఁ గఱపించుట యనుకొంటివా? భీష్మద్రోణ విదురాది మహాత్ములఁ దిరస్కరించుట యనుకొంటివా? ఏమని యిచ్చటికి వచ్చితివిరా?

కర్ణు: (తనలో) ఈతఁడు మా రహస్యముల నన్నిటిని వెదకి చెప్పుచున్నవాఁడు. ఈతండెట్లెఱింగెనో? అయినను బ్రాహ్మణులు తపోధనులు. వారలెట్టి రహస్యములనైన నిమిష మాత్రమున నెఱుఁగుదురు.

దుర్యో: వృథాప్రలాపీ ! బ్రాహ్మణాధమా ! జుట్టుటకుఁ బాయసమని వచ్చితివా ? ఇది యజ్ఞశాలయని వచ్చితివా ? నీవేమని వచ్చితివిరా ?

అర్జు : ఓరీ ! మూర్ఖుఁడా ! నీ చలమును, బలమును, ఈవఱకే యెల్లరకును దెలిసినవి. నేనెందుకు వచ్చితినో యీ కార్యము తేటపడఁగలదు. నీ రాకకుఁ గతమేమి ? యుష్మత్సాహసమునకును మనోధైర్యమునకును దోడు మత్స్యయంత్రముఁ దెగవేయ నెంచితివిగా ? ఏమి నీ సాహసము, ఈ కార్ముకము చేతఁబూనఁ దలఁచితివిగా ! ఏమి నీ సాహసము ? ఇంతటి సాహస కార్యమునకీవు సన్నద్ధుఁడవగుటచే నెక్కడనో మిక్కిలి యక్కజ మొక్కటి విక్కముగాఁ బుట్టకమానదు. యంత్రముఁ దెగనేయుటగాదు. కార్ముకముఁ బూనుటయెట్లో, బాణము సంధించుటయెట్లో, గురిచూచుటయెట్లో, లేశమైనఁ బరిజ్ఞానము కలదటరా !

దుర్యో: ఓరీ ! నీవే మహాప్రజ్ఞాదక్షుఁడవని యన్యుల నధిక్షేపించెదవు. నా గదాదండమున నీ శిరము భిన్నము చేసెద. రారమ్ము. మాటలతోఁ బ్రయోజనమేమి ?

అర్జు : ఆ! నీగదయు, నీవును, నీ బలమును, నడఁగవలయును. కిరాతుల రీతిని రోకలినొక్కదానినిఁదెచ్చి గదగదయని బెదరించెద విది భయము నిచ్చు నవియేనా? నీకు యుద్ధముకూడఁ దెలియునటరా? మృదుతర హంసతూలికాతల్పముపై కంచుకి దాసీ జనము పరిచర్యలుచేయ సుఖముగా నిదిరించుట యెఱుఁగుదువుగాని యుద్ధమెఱుఁగుదువా ?

ఆ॥ వె॥ మానధనుఁడవేని మగవాఁడవగుదేని। పరువుగల్గురాచపట్టివేని
మడమ దిరుగకుండ మానంబు సెడకుండ। గదిసి నన్ను
గెల్వు కదనమందు.

దుర్యో: నీ బిభీషికలకు మేము బెదరువారముగాము. రా రమ్ము.

(అని యిద్దరును దూసికొనుచున్నారు.)

కృష్ణు : బావా ! దుర్యోధనా ! అకాలమున నాలముగావించుట యుక్తమా?
నీకుఁగయ్యమొనరింప నవసరమేమి ? బ్రాహ్మణోత్తమా ? నీవైన
నూరకుండుము.

దుర్యో: మాధవా! నన్నాపకుము. వీనిని మరణము నొందించినఁగాని నే
నూరకుండను.

అర్జు : మహాత్మా ! దేవకీనందనా ! ఖడ్గమునకు లభించిన యీ యెరఁ
బోగొట్టుట భావ్యముగాదు. రానిమ్ము.

కృష్ణ : మిత్రుఁడా ! దుర్యోధనా ! నీవుకాదు. ఈ పాపపుఁబాపని నేనే
పరిమార్చెద. నీ వూరకుండుము. బ్రాహ్మణాధమా ! నీవిటు
రారా ! ఇదిగో చచ్చితివి.

అర్జు: ఈ దుర్యోధనుని యుద్ధమైనది. ఇఁక నీవా ? నీవుమాత్రము నీ
ప్రియమిత్రునికంటె నధికమెట్లు చేతువు ?

దుర్యో: మూర్ఖుఁడా ! నేను బరాక్రమ హీనుఁడనై నీతోఁ బోరలేదని
యూహించుచుంటివా ? అట్లుగాదు.

ఉ॥ ఈవసుదేవనందనుఁడు నీధరణీశులు నంగరాజు న
న్నీవల నాగుచుండుట మహీసురపాంసన ! యీదినంబునన్
జీవముతోడ దాఁటితివి, చెన్నటి ! యైనను నేమి ? యంగ ధా
త్రీవరుఁడైన కర్ణుఁడిటు ధీరతఁగూల్చుఁడె నాజి నిన్నిఁకన్ ॥

అర్జు : ఓరీ ! మూర్ఖా ! నీకు సాధ్యముగాదుగదా! ఇఁక నీప్రియమిత్రుఁడు చంపుటకేమిలే! ఓయీ యంగరాజా ! దుర్యోధన ప్రాణమిత్రా! సూతకులసంభవా ! రారమ్ము. నీయుద్ధమును నీచర్యయు చూతమురా !

కర్ణు : ఓరీ మూర్ఖా ! ధరాకాంతులతో మహీసురులు పంతములాడి గెలువఁజాలరు. పోపొమ్ము.

అర్జు : ఏమీ! నీవు ధరాకాంతుఁడవా ? అన్నవస్త్రములులేక రధకారకుఁడవైన నిన్ను మహామూర్ఖుఁడగు దుర్యోధనుఁడు శునకమును గద్దియపై నుంచి నటు లంగరాజుగా నొనరించుటచే నెంత క్రొవ్వు బలిసినదిరా ? నీవిచ్చటికేలవచ్చితివి? రథము తోలుకో, వగ్గములున్నవని యిచ్చటికి వచ్చితివా ? గుఱ్ఱములను ఆక్కఁ జేయుటకు వచ్చితివా ? చాలు! చాలు! ఈపాటికి గృహమున కరిగి రథము తోలుకొనుము. పో!

తే॥ గీ॥ రథము తోలుటమాని కౌరవులయింటఁ
బొట్టకూటికిఁ జేరిన జెట్టివీవు
బ్రదికి చెడినట్టి మముబోటివారికన్నఁ
జెడిబ్రదికినట్టి నీయందె చేవగలదు!

ఆ॥ వె॥ దుష్టచిత్తుఁడైన దుర్యోధనుంశట్లు
పాండుసుతులమీఁది పగ దలంచి
కుక్కనందలంబు నెక్కించులాగున
నంగరాజుఁజేసె నకటనిన్ను.

కర్ణు : ఓరీ ! ఏమిరా ! పేర్లుకొనియెదవు ? ఈ సభాధ్యక్షులిందఱు నీ పేర్లరితనమిదిపఅకే యెఱుఁగుదురు ? ఇఁకఁ జాలునూరకుండుము.

అర్జు : ఓరీ ! నా పేర్మిలరితనము తెలియలేదు. నీ దురాచారములాను తేటపడినవి. పాండవ నిర్మూలనమునకుఁ బాండవ ధార్తరాష్ట్ర కలహ మునకునుఁ గారణభూతుడవైన మహా పాతకుఁడవు నీవే ! నీ వదన దర్శనము మహాపాతక హేతువు.

కర్ణు : ఓరీ! సంభావనలకుఁ బోవుచు వివాహ యజమానులతోఁ బోరుట యనుకొంటివా ? రా రమ్ము.

అర్జు : గురుశాపోప హతుఁడవగు నీ బలమెంత ? సూతకులమున జన్మించి పాతకముల కొడిగట్టు దుర్యోధనునితోఁ గూడి దురా చరణము లొనరించుట యనుకొంటివా ? కురుపతి యింటఁ గూటికై చేరి దుర్మదమునఁ బెద్దలఁ బరిహసించెదవేమి ? చెడి బ్రిదుకుటచే స్వల్పైశ్వర్య మదమున నొడలెఱుఁగక పేర్మిలు నీ నాలుక వేయి చీలికలుగాఁ గోసెదను.

కర్ణు : మూర్ఖా ! బ్రాహ్మణాధమా ! నీ కావరమడఁచెదరా ! (అని మీఁదికిఁ బోవుచున్నాఁడు.)

అర్జు : రాధాగర్భ భారభూత ! సూతకుల సంభూత ! అల్పరాజ్య మదాంధీభూతమతీ ! నీచా! పాపాత్మా ! రారా! నీ యాయుర్దాయము నేఁటితోఁ జెల్లినది. ఇందు ద్రౌపదీ స్వయంవరాచరణము కాక నీ మరణమే జరుగును. (అని యిద్దరును బోరి కర్ణుఁడోడిన యనంతరము,)

కర్ణు : అబ్బా ! ఏమిది ? భార్గవరాముఁడో ! కరటిదైత్యవిరాముఁడో ! పాండవ మధ్యముఁడోకాని నాతోఁ గయ్యమొనర్చి యన్యులెవ్వఁ డును గెలువలేరు. నీ వా మహాత్ములలో నెవ్వరవు ?

అర్జు : మూర్ఖా! పరాక్రమ ముడిగి సాధువాక్యములు బయలువెడలినవిగా? నేను వారిలో నెవ్వఁడను గానుగాని యసాధారణ కార్ముక కళా ధౌరేయుఁడనగు నొక్క నరుఁడను, ధరామరుఁడను, రధిక వరుఁడను.

ఆ॥ వె॥ బికిరమెత్తువాఁడ బీదబాపనవాఁడ
విల్లుముట్టుటెట్లు చెల్లునాకు ?
పరుశురామునొద్ద బహువిద్యలనునేర్చు
బల్లిఁదుడవు నీకె చెల్లుఁగాక !

కృష్ణ : ఓయీ ! అంగరాజా ! మహాత్ములగు భూసురోత్తముల నాల మున గెలువ నీతరమే ? త్రేతాయుగమున జామదగ్న్యుఁడు క్షత్రియకులముల నేకవింశతివారము నాశనము నొందింపలేదే ? కావున మీరెల్ల రుడుగుట నా యభిప్రాయము. తపోధనులు బ్రాహ్మణులు !

కర్ణు : ఔను. బ్రాహ్మణోత్తముల నిర్జించుట దుస్సాధ్యము. వారు తపోధనులు, మనము ధనుర్ధరులము. ధనుర్బలమును, మనో బలమును, దేహబలమును, తపోబలమునకెన గా నేరవు. కావున వారతోఁ బోరిగెలుచుటకుఁ జాలము. రాజా ! కౌరవేశ్వరా ! నీ యభిప్రాయమేమి ?

దుర్యో: అంగరాజా ! నీ మాట నిశ్చయము! బ్రాహ్మణుల గెలువ మనకు సాధ్యమగునా ? నీ యభిప్రాయమే నా యభిప్రాయము.

కృష్ణ : ఓరీ! మూర్ఖుఁడా! దుర్యోధనుఁడా! (తనలో) మొదటి నుండియు నీవిట్లే చెడిపోతివి! అంగరాజే మాటపలికినను వెంటనే వంది మాగధుల చందమునఁ నౌనౌనని పలుకుచుందువు. ఇందుకే

తెలిసిన మూర్ఖుఁడవని ప్రపంచమునకు వెల్లడియైనది. లేకున్న నీవా ! ఈతనితోఁ బోరగలవాఁడవు. నీవెన్నఁడును బాగు పడవు.

అర్జు : పరాక్రమ హీనులారా ! స్త్రీల చందనమున మీరిరువురును నన్ను గెలువలేక లేనిపోని వంకలు పెట్టుచుంటిరి! పో పొండు.

ఆ॥ వె॥ ఆడుదానికైన నభిమాన ముదయించు
పగతుచేతిమాట పడినయప్పు
డంతకంటె నీవె యధమాధముఁడవినీ
బ్రతుకనేల యిట్టిబ్రతుకు ! రాజ !

కర్ణు : కౌరవేశ్వరా ! మనమీతనితోఁ గయ్యము సేయుటగాదు. ఈ బ్రాహ్మణుఁడేమి యపచారము గావించె ? తన శక్తికొలఁది నీ యంత్రము నేయవచ్చెను. ఎవ్వఁడీ యంత్రమునేయు నాతనికిఁ దన కూఁతు నిచ్చెదనని దుస్తర ప్రతిజ్ఞచేసిన ద్రుపదునితోఁ బోరుదము రమ్ము.

దుర్యో: మంచిది. అట్లే చేయుదము రమ్ము (అని వెళ్లుచున్నారు.)

కృష్ణ : ఈ పాండునందనుల చరిత్రమును, వీరలు కర్ణాదియోధులఁ గెల్చుటయు నాబలదేవున కెఱుఁగఁజెప్పెదను. ఆనందము పట్టఁ జాలకున్నాను. ఇంకనేనరిగెదను. (అని నిష్క్రమించును.)

ద్రౌపది: చేటీ! బ్రాహ్మణుఁడీతఁడే విజయుఁడై యున్నాఁడుసుమీ ! చెలీ ! ఏమోకాని యిమ్మహామహీసురు దర్శించుటయాదిగా నీతనియందెద్దియో యొక యనురాగము నాకుఁ బొడమెడును. అది యియ్యది యని నిర్వచింపఁజాలకున్నాను. కారణమైన నూహింపలేకున్నాను.

చేటి : సఖీ! దానిఫలము వెంటనే తెలియఁగందు

అర్జు : (తనలో) రాధేయ గాంధారేయ రధికవరులను నాహవసీమను నిర్జించుట నీకాంతారత్నమునుఁ జూచిగదా ! నా బాహుబలము నీమెకు దాన-దేటపడఁగలదు. నేను భాసురభూసురవేషమున నుంటచే నాపై నీమెకనురాగముండునో యుండదో !

ద్రౌపది: (తనలో) ఈ మహానుభావుఁడు బ్రహ్మతేజమున నున్నవాఁడు గాని యీతని శుభలక్షణముల నవలోకింప నొక్క మహారాజ కుమారు నాకారమున నున్నవాఁడు. హిమగిరి కన్యపై నరిగి భువన సంచారము గావింపఁదలఁచి వచ్చిన హరుఁడోయన వెలుగుచున్నాఁడు.

అర్జు : ఆహా! హా! ఈ రాజేంద్రకుమారికారత్నసౌందర్యము వర్ణనాతీతమై యెట్లు విలసిల్లుచున్నదో! పూర్ణిమాయామినీరాజ బింబము నిరభ్యంతరముగ నధిక్షేపింపఁజాలు మందస్మితసుందరవదనమును, నీలాభ్రమును హాసము చేయఁజాలు ఘనతర వేణీ భారమును, జిమిలి ముక్కాలుబారు లొక్క మొగిని గూడె ననఁజాలు నా యలకజాలమును, నా వర్ణనకుఁ దధ్యముగ సాధ్యముగాని మధ్యమును, మందాకినీ సైకతముల చందమున నందమగు పిఱుదులును ఆహా! హా! నయనోత్సవము చేయుచున్నవి.

తే॥ గీ॥ చందమామకు లేదింత చక్కదనము
మెఱపుఁదీగకు లేదింత మేలుచాయ
కుందనమునకు లేదింత క్రొత్తతళుకు
దేనిఁబూని సృజించెనో దీనినజుఁడు.

ద్రౌపతి: శ్రీపార్వతీనాధుని వడువునఁ గంఠమున నారుద్రాక్షమాలికయు, నొడల నాభస్మమును, జెంగావి దుకూలాంచలమును, నాయాయతబాహుయుగమును నా చామీకరదేహమును గలిగి విభ్రాజమానుఁడగు నీ మహాపురుషుఁడు క్షత్రియోత్తముఁడే మో: కారణాంతరమున విప్రవేషియైనట్లు తోఁచుచున్నది. సకల రాజన్యకుమారవర్గమును జూడ మనోవికారములేని నాకీ నిరుపేద బ్రాహ్మణుఁజూడ శరీర మంకురత్పులక జాల విద్ధసర్వాంగ మగుచున్నది.

అర్జు: ఈ నారీరత్నము బాహుద్వంద్వము మందారకల్పమహీరుహ శాఖల తెఱఁగున వెలుఁగుచున్నది. ఈ మానిని మోము మదీయ హృదయసంతాపార్ణపవర్ధని యగుటచే సుధాకరమండల మనియు, నీప్సితార్థదాయి యగుటచే కల్పమహీరుహమనియు, నధరమధురసుధారసధారాసమన్విత మగుటఁజేసి యమృత కలశమనియును, శ్లాఘింపఁదగును. నిజమందిరము విసర్జించి భువనమునఁ జరియింపవచ్చిన యిందిరయో, హరుసుందరియో, నిజోరుస్తంభ విజృంభజిత రంభాస్తంభయు, శుభారంభయునగు రంభయో యైయుండనగు లేనిచో నీకాంతి యేకాంతలయందు నేలలేదు ? ఈమెనుఁగొనుటకు రతీధవ, శచీధవ, మాధవ, రమాధవులుగాని క్షమాధవుఁడొక్కఁడు చాలునే ? సకల సద్గుణముల దొంతియో పంచమార్గణు పూఁబంతియో, పుంజమై వచ్చిన కాంతియోగాని యిది యింతిగాదు, కమ్మవిలుకాని శుకమ్ముగాని కొమ్మగాదు, సకల సద్గుణజాలగాని బాలగాదు. ఆ హస్తపల్లవాలంకృతమై లతాంతాయుధుని యాఱవ మార్గణము నందమునఁ దేజరిల్లు నాకుసుమదామకమే నా కధిక సంతాపముఁ గలుగఁ

జేయుచున్నది. సుగంధ మల్లికా కుసుమదామయు, సకల భూషణధామయు, శరీరకాంతిజితహేమయు, నభినవలావణ్య సీమయునగు నీమెపైఁ బ్రేమనేమని చెప్పఁగలను? కాని నాకు నీమెపై ననురాగముండిన నేమిఫలము? పరస్పర ప్రేమ మెచ్చట దటస్థమగునో యచ్చటనే కాముకుల యభీష్టములు నిర్విఘ్నముగ నెఱవేఱఁగలవు. లేనిచో వృథాగదా!

ఆ॥ వె॥ తుంట వింట మరుఁడు తొడిగి యేసిన యమ్ము
తాకవచ్చు నొండె తప్పవచ్చుఁ।
గొమ్మవాడి చూడ్కి గుఱిచూచి కొట్టిన
దగులవలయు గుండె పగులవలయుఁ।

తే॥ గీ॥ అంధకారాతియైన నీయతివఁగన్న।
నంధకారాతి శయమెత్తి యరుగువెంట।
మగువ తనయంద నుండెనా? మరులుగొల్పు
రాతికైనను శంబరారాతికైన.

ద్రౌపది: ఈ మహాపురుషుఁడు క్షత్రియప్రవరుఁడేకాక బ్రాహ్మణుఁడైనచో నాహృదయమీ మహాత్మకడకేల యరుగఁగలదు? ఇందిరానివాసయోగ్యమగు మహోరస్థలమును, విశాలఫాలమును, నాజానుబాహుదండములును జూడ రాజకుమారుఁడనియే తోఁచుచున్నది. చేటీ! యీవిషయమున నీయభిప్రాయమేమే!

చేటి: సఖీ! ఈతఁడు నిక్కముగా రాజపుత్రుఁడు. ఈతని సంగతిచూడ నిజముగా నీయంతర్యముఁదెగనేసి నిన్నుఁజేకొనఁగలఁడు. భయపడకుము.

అర్జు: ఈ మత్తమాతంగగామిని మానసము చందము నెఱిఁగియైన పని చేయుదమన్న నీమెతో మాటలాడుట యెట్లు? ఐనను రూపము నను, వీక్షణములను, వచనములను, గాంతయభిప్రాయ మెఱుఁగవచ్చునని కొందఱు శాస్త్రవర్తివీణులు వచింతురు. కావు ననీ మందయాన చందము నే నెఱిఁగెద. ఆమెదృష్టిప్రసరణ ములు చంద్రికిరణములవలె నాపైఁబడుచున్నవి. ఈమెకు నాపై ప్రేమగలదు. ఇన్నివిధములఁజూడనేల? యంత్రమునుగొట్టెద.

ద్రౌపది: చెలీ! ఆమహీసురుఁడే యంత్రభేదనమున కరుగుచున్నాఁడు. చూడు! చెలీ! నాచేతిపూలదండ జాఱుచున్నది. కారణమేమో యెఱుఁగుదువా?

చేటి: ఔను. ఈతఁడే నెఱవేఱుఁగాక! ఆదండ వానిపైకరుగుచున్నది.

అర్జు: ఆహా! హా! ఈయంత్రముఁగొట్టఁగలనో లేదో గదా! (అనిదగ్గరఁకు బోవుచున్నాఁడు) (తెరలో) ఓహో బ్రాహ్మణు లారా! మనవాఁడే యొక బ్రాహ్మణుఁడు పోవుచున్నాఁడు. రండి పోదము.

అర్జు: శ్రీమదఖిలాండకోటిబ్రహ్మాండనాయకం, శ్రీమన్నారాయణ చరణావతారం, ఇందిరానందమందిరం, చిదానందకందస్వ రూపం, నందనందనచరణారవిందం, వందేహం! శ్రీమ త్కుంభసంభవాచార్యవరగురుచరణపంకేరుహం నమామి! (అని విల్లునెత్తి) ఈ విల్లు నాకరముల కింత చులకనయై యుండఁగా నన్యరాజన్యులు స్పృశింప నోపమికిఁ గారణమేమి చెప్పుమా? కార్ముకము చులకనయైననేమి? దీనినిభేదింప వలయును గదా?

ద్రౌపది: అదుగో! మార్గణముల వదలుచున్నాఁడు. ఈతఁడు విజయుఁ
డగుగాక!

చేటి: తథాస్తు.

అర్జు: నేనా శ్రీహరిహర పాదపద్మధ్యానైక శీలుఁడనేని, ఆకుంభ
సంభవాచార్య ప్రియశిష్యుఁడ నగుదునేని ఈ మార్గణమనర్గళ
ముగా నా మత్స్యయంత్రమును భేదించుఁగాక! (అని విడువఁగా
యంత్రము పడుచున్నది.)

ద్రౌపది: (తనలో) ఈ భూసుర ప్రవరుఁడీ మత్స్య యంత్రముఁదెగ
నేసి నాకుభర్తయయ్యె. ఎవ్వరైననేమి? బ్రహ్మక్షత్రియ పురు
షుల నేరినైనఁ బెండ్లియాడవచ్చుఁగదా! ఈ సౌగంధిక సుదా
మకమునేనా మహానీయుని కంఠమున వేసెద! (అని యర్జునుని
మెడదండవేసి) ప్రాణేశ్వరా! నమస్కారము.

అర్జు: చెలీ! నీవుమాయెడల వింతపరిచర్య యొనర్పనేల? నీకర
స్పర్శనమే మాకపందకూతూహల మొసఁగినది. కల్యాణీ!
నీతలఁచిన కార్యము నెఱవేఱుఁగాక! ఆహాహా! సుందరీ!
నీపల్లవహస్తములకును, నీదామమునఁగల ప్రసూనములకును
లావణ్యమున భేదములేదు సుమా!

ద్రౌపది: ప్రాణేశ్వరా! ఈ వఱకును నీదాసురాలొనరించిన తప్పులు
క్షమియింపఁగోరెదను.

అర్జు: దేవీ! నీమనోరథ మెఱుఁగక యింత యాలస్యముచేసిన యీ
పురుషునిపైఁ గరుణింపవలయును. (తెరలో) (కలకలానంత
రమున) ఓహో దృష్టద్యుమ్నాది కుమారవర్గములారా! ఓహో,

పాంచాలరాజేంద్ర వరూధినీ నాధులారా! మీరందఱు నాల కింపుడు.

మ॥ వరధానుష్కులు నస్త్రశస్త్రవిదులున్ బాస్వత్ప్రతాపాఢ్యులున్
దరమోపెట్టఁగలేని విల్లుగొని యంత్రిన్యస్తమత్స్యంబు, ను
ద్ధురతన్ వేసి యపారకార్ముకకళాధుర్యత్వముంజూపిన
న్నరుపక్షంబున నిల్వఁడాలమున ప్రజ్ఞాఢ్యుల్ మదక్షౌహిణుల్

(అప్పుడు కోపముతో ధృష్టద్యుమ్నుఁడు ప్రవేశించును.)

ధృష్ట: ధృష్టద్యుమ్నుఁడను నేనుండ భయమేమి? ఈర్ష్యాయుంరూనిల పేర్రితమైన సకలరాజసముద్రక్షోభమగుచుండ నీ మత్స్య యంత్ర భేదము గృతకృత్యుఁడగు మహీసురునిపైఁ బొరలి రానుండుట చూచి ద్రుపదమహారాజుగా రిట్లాజ్ఞాపించిరి. ఓ రాజ కుమారులారా: రండు పోదము. ఓ బ్రాహ్మణోత్తమా! నీకు నేను సహాయుఁడనైతి, వెఱవకుము.

అర్జు: వెఱపను శబ్దమున కర్థమెద్దియో యెఱుఁగను. (అప్పుడు రాజులతో ధృష్టద్యుమ్నార్జునులు పోరుదురు. రాజులు పారిపోవుదురు.)

ధృష్ట: అమ్మాయీ! ద్రౌపదీ! ఈతఁడు మహీసురవంశ సంభూతుఁడైనను రూపయౌవనముల నీకుఁదగిన రాజకుమారుని బోలి భాసిల్లు చున్నవాఁడు. నీ వుత్తమ క్షత్రియాంగనవని నీధవుఁడు బ్రాహ్మణుఁడని తలఁపక పతినిదైవముగా భావించి యతని యందతి భక్తితోనుండుము.

ద్రౌపది: అన్నయ్యా! పతివ్రతాతిలకమునకు దైవదత్తుఁడగు పతియే దైవమనునభిప్రాయముండును. అదియునుఁగాక తమ యాజ్ఞ యన్యధా కాఁగలదా?

ధృష్ట: బ్రాహ్మణోత్తమా ! ఎన్ని జన్మములఁ బుణ్యముఁ జేసితిమో గాని క్షత్రియుల మయ్యు బ్రాహ్మణులతో సంబంధము చేయఁగల్గెను. ఈ సుకుమారి హోమగుండసముద్భూతసాధ్వి, దీనిని జాగ్రత్తగా నేలుకొమ్మ

అర్జు: రాజకుమారా! నేను మాతృమెఱుఁగనా? ఇఁక నేల నిజమందిర మున కరిగెదము. మీరును బొండు.

ధృష్ట: అమ్మాయీ! కంటఁదడిపెట్టకుము. పోయివచ్చెదను.

ద్రౌపది: అన్నయ్యా! నావందనము మాతాపితలకుఁ దెలుపుము.

ధృష్ట: అట్లే తెల్పెదను.

ద్రౌపది: చెలీ! నాపెంచిన కీరశారికావారములను నీవు పెంచుము. ఉద్యాన వనమున నేఁ బెంచుచున్న లేఁత చెట్లను, దీఁవలను నీవే పెంచుము.

చేటి: దేవీ ! అట్లే చేసెదను. పరమ పావనమగు హోమకుండమునఁ బుట్టి, పరమపావనులగు విప్రులఁ బెండ్లియాడితివి. నీ యదృష్ట మేమని చెప్పఁగలము ? నీకు శుభమగుఁగాక.
దేవీ ! పోదము రమ్మ !

చతుర్థాంకము సమాప్తము.

———

# పంచమాంకము

(ద్రుపదుని భటు లిద్దరు ప్రవేశించుచున్నారు.)

ప్రధ: ఈసారి మన ద్రుపద మహారాజుగారి వంత తప్పక తీఱఁగలదు.

ద్వితీ: ఇంకను వంతకుఁ గారణమేమి? కుమార్తె వివాహ మాయెనుగా?

ప్రధ: నీ వింకను నెఱుఁగనే యెఱుఁగవా? అట్లాబ్రాహ్మణుఁడు మత్స్య యంత్రమునేసి యాజ్ఞసేనినిఁ దొడ్కొని పోయిన దాదిగా నా పురుషుఁ డేజాతివాఁడో, నీచుఁడో, ఘనుఁడో, యని చింతిల్లు చుండి వారి నిలయమున కరిగి వారి వంశచరిత్రము నరయుమని ధృష్టద్యుమ్నునిఁ బనిచెను. అతఁడే వాని చరిత్రమెఱిఁగి క్షత్రి యుఁడని వార్తఁదెచ్చెను.

ద్వితీ: అందుకే కాఁబోలును ద్రుపదమహారాజు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులెక్క నర్హమగు నాల్గు రధములు తన పురోహితు నితోఁ బంపెను.

ప్రధ: అదియును మేలే! అతఁడే జాతివాఁడో ఆరధముపై నెక్కును.

ద్వితీ: అదిగో రధములు నైదును వచ్చుచున్నవి. మనము సభామండప మలంకరించవలసి యున్నది. పోదము రమ్ము (అని నిష్క్రమింతురు.)

(ఇది ప్రవేశకము)

(ద్రుపదమహారాజు సభామంటపము. ద్రుపదుఁడు, ధృష్టద్యుమ్నుఁడు, ధర్మరాజు, భీముఁడు. అర్జునుఁడు, నకులుఁడు, సహదేవుఁడు, ద్రౌపది, కుంతి, శ్రీకృష్ణ ధౌమ్యులు ప్రవేశింతురు).

ద్రుప౽డు: (తనలో) దినేంద్ర ప్రతిమాన భాసురరూపముల౽బోల్చియవ లోకింప వీర లవనిప తనయుల యనువున నున్నవారు. ఇంకనా కోరిక తీరినది. (ప్రకాశముగా) మహాత్ములారా! తావక జనన కారణమున నేయన్వయము ధన్యతనొందెను. మీకేవురకునుగల బాంధవ్యమెద్ది? ఆవృద్ధ నాతి యెవరు? ఈమత్స్య యంత్రము నేసిన మహావీరు౽ డెవ్వరు? మీ పవిత్ర చరిత్రము౽ జెప్పి మరుగుచున్న నా హృదయతాపము౽ దీర్పవలయును.

ధర్మ: (నవ్వుచు) రాజా! ఏపురుషు౽డు మత్స్యయంత్రము౽ దెగనేయు నాత౽డే నీపుత్రికారత్నమునకు పతి౽గా౽గలడు గదా! అట్టియెడ నెవ్వ౽డైన నీకేమి? నీప్రతినను సార్థముగా౽ జేసిన వా౽డే నీకుమార్తెకు ధవు౽డయ్యెను.

శ్రీకృ: రాజా! పాంచాల మహీధరా! నీప్రతిన ప్రకారము శూద్రు౽డు దీనిని౽దెగనేసినను నీపుత్రికను౽బెండ్లాడ వలయునుగదా! దాని నింక నడిగిన ఫలమేమి?

ద్రుప: మహాత్మా! మాధవా! పుత్రికల౽గాంచువఱకును నొక విచారము, కాంచిన వెనుక దానిని౽ దగిన మగని౽దెచ్చువఱకు నొక దురంత చింత, తెచ్చినదాదిగా నది సుఖపడుచున్నదో? లేదో? మగ౽డెట్టి గుణాఢ్యు౽డోయనివంత! అందుచే౽బుత్రిక యెట్టిభర్తను గాంచెనో యని యెఱు౽గ గుతూహలము వొడమి యడిగితిని. అయినను జేయునది లేదుగాని, యదియొక వెఱ్ఱి.

ధృష్ట: మాధవా! అది సకల జనములకు సహజమేగదా! జగదారాధ్యు౽డ వైన నీవెఱు౽గని యంశ మెద్దిగలదు?

కృష్ణ: ఔను. ఆమాట నిశ్చయమే.

ద్రుప: మహాత్ములారా! నాయడిగిన ప్రశ్నమున కుత్తరము నీరైతిరి.

ధర్మ: రాజేంద్రా!

ఉ॥ భారత వంశజాతుఁడను బాండునృపాల సుతాగ్రజన్ముఁడన్
పేరు యుధిష్ఠిరుండనఁగ వెల్లడి యయ్యె జగంబులందునన్
వీరలు మత్సహోదరులు, పేరిమి నీయమ మాత మాకు, దు
ర్వార తపోధనుండయిన వ్యాసుఁడు మాకుఁ బితామహుండగున్॥

ద్రుప: ఆహాహా! ఏమి నాసంతోషము? పట్టఁజాలకున్నాను. వత్సలారా! లాక్షాగృహ మహాదవానల మధ్యమునుండి యేరీతిని బ్రతికి వచ్చితిరి. ఆహాహా! ఈదినము కడు సుదినము. మీసందర్శనమున నాడెందమున కానందము పరిమితి లేకున్నది?

ధృష్ట: మీరుత్తమ క్షత్రియులని నేను మున్నే యెఱిఁగితిని.

ధర్మ: ఆడిని ధనుర్ధరులైన ముట్టఁగలేని కార్ముక మవలీల నెత్తి యంత్రము గొట్టినవాఁడే యర్జునుఁడు, సురాసురదుర్నిరీక్ష్యబల దర్పధుర్యుఁడీతఁడు నాపెద్దతమ్ముఁడు భీమసేనుఁడు. వీరిరువురును మాద్రిసుతులు నకుల సహదేవాభిధానులు.

ధృష్ట: వత్సలారా: నా నయనోత్సవకరులగు మీరు లాక్షాగృహమున నుండి యెట్లు దాటితిరి? ఇంతటి మహాభాగ్యము గల్గుటచే దేవ ప్రీతిని జేయవలయును. ఓరీ! ఎవ్వరురా? అక్కడ?

సేవ: దేవా! ఆజ్ఞాపింపుఁడు. ఇదిగో వచ్చినాడఁను.

ద్రుప: నీవుపోయి మన పురమునందలి దేవాలయములన్నిటిలో వన్ని యుత్సవములఁ జేయింపుమని మా పురోహితులతోఁ జెప్పుము.

సేవ: చిత్తము.

ధృష్ట: వీరలు పాండునందనులని తెలియలేదుగాని యెవ్వరో క్షత్రియ కుమారులని విన్నటిదినమున రహస్యమునఁ దదీయ నిలయోపాంతమున కరిగి వారిచర్యల నెఱిఁగి నేఁ దెలిసికొంటిని.

శ్రీకృ: అమత్స్యయంత్రముఁ దెగనేయు దినముననే యాతఁడర్జునుఁడనియు, వీరలు తక్కిన పాండవులనియు నేనెఱింగితిని.

ధర్మ: మహాత్మా! దేవకీనందనా! మమ్మెట్లెఱింగితిరి?

శ్రీకృ: యుధిష్ఠిర! మిమ్మేకాదు. మీనిలయమునుగూడ నెఱింగి నేనును బలదేవుఁడును, వచ్చితిమి. కాదా?

ధర్మ: అదియెట్లు మీరెఱింగితిరి?

భీమ: అన్నయ్యా! పంచభూతసమన్వితమై యలరారు చతుర్దశ భువనములను, నుదరకుహరమున ధరించి పరాత్పరుఁడగు మహానుభావుఁడు మనల నెఱుఁగకుండునే?

శ్రీకృ: శ్యామల జీమూతాంతర్గతుఁడైన ప్రభాకరుఁడు నిజతేజ మీష న్మాత్రముఁ దొలఁగక చాటున యదాప్రకార ప్రకాశమున నున్నట్లు బ్రాహ్మణ రూపములతో నుండిన మాత్రమున మీతేజము డాగలేదు. దానఁజేసి నేనెఱింగితిని.

ద్రౌపది: ఈ మహానుభావు లొండొరులమించు తేజులు గలవారు.

ద్రుప: నగరరాజమంతయు నీవలకే యలంకరించి యుంచినాము. సకలరాజన్యకుమారవర్గములు నీవలకే చనుదెంచి యున్నవారు. మామక పుత్రికా పరిణయార్థమై సకల వస్తు ప్రయత్న మీవలకే జరిగినది. ఇంక వివాహమున కాలస్యమేల? పాండవాగ్రజా!

వివాహమునకై మీ యర్జునుని వేగ నియోగింపుము. త్వరపడు. త్వరపడు.

ధృష్ట: తండ్రీ! మన ప్రతిన నెఱవేఱినది. సాగరావర్తసంభూతమగు పరిశస్తపరివాళము రాజేంద్రప్రసక్తప్రదేశమున కరుగు చందమున నీమనకృష్ణ యర్జునునకే భార్య యగుచున్నది.

ధర్మ: రాజేంద్రా! పాంచాల భూపాలా! ఈ యాజ్ఞసేనిని మే మేవుర మును బెండ్లియాడుట కాజ్ఞ నొసఁగ వలయును.

ద్రుపదుడు: (విస్మయముతో) యుధిష్ఠిరా! ఏమిది? ఐదుగురును బెండ్లి యాడెదరా? ఇట్టి యాశ్చర్య మెందైనఁ గలదా? వింతలు పలికెద వేమి?

దృష్ట: సకల ధర్మాధర్మ విచక్షణుఁడీ ధర్మజుఁ డిట్లు పలుకుచున్నాఁడేమి? ఏమిది?

ద్రుప:

చ. ఒకధరణీకళత్రునకు నందురు భార్యలు పెక్కు రెందునన్
ఒకతెకె భర్త లేవురయి యుండుట భూవలయంబు నందునన్
అకటా! కనంగలేదు వినియైన నెఱుంగము దీనివిన్నచో
వికవిక నవ్వరే జనులు వీడుము నీదగు పట్టు భూవరా!

కావున నీమె వింక నర్జునునకిచ్చి వివాహము చేసెద. దీని కొడబడుఁడు.

ధర్మ: రాజేంద్రా! ఇది మామాతృనియోగము. మత్స్యయంత్రముఁ జెగనేసి ద్రౌపదిని గొని మాయర్జునుఁడు 'ఫలంబుఁదెచ్చితినమ్మా' యని మాజననికి నివేదించె. మాజననియు ఫలముగాఁ దలఁచి

మమ్మేవుర ననుభవింపఁబనిచె. అందులకే మియ్యకొంటిమి. మా మాతృవచన మీవర కెన్నఁడును ననృతముఁగాలేదు. ఇప్పుడుఁ గాఁగూడదు. కావున మాకేవురకిమ్ము.

ద్రౌపది: (తనలో) ఈయుధిష్ఠిర మహారాజు తనపట్టును వీడకున్నాఁడు ఇం దీతఁడు నెఱవేఱుఁగాక!

ద్రుప: యుధిష్ఠిర! మీజనని ఫలమని వగచి యేవుర కనుజ్ఞ నొసగెను. కన్యయని తానెఱిఁగిన వెనుక నట్లేల యనును? అదియునుఁగాక నీకార్యము లోకవిరుద్ధము. మనమో రాజులము. సకల జనములకు ధర్మమొసఁగువారము. మనమే ధర్మమార్గ మతిక్రమించిన జగము తాళదు. కావున నాలస్యము చేయక దీనికొడఁబడుము.

కుంతి: రాజేంద్రా! నావచన మప్రతిహతమగుఁగాక! అది వేఱుగాఁ దలఁపక నీపుత్రికను వీరి కేవురకు నిమ్ము. అది ధర్మవిరుద్ధము గాదు.

ద్రుప: సమస్త ధర్మములనుదెలిసి కాలము గడిచిన పెద్దదానవు. నీవే యిట్లనెదవేల?

ధర్మ: ధర్మవిరుద్ధము లేదుగావున నామెచెప్పినది తప్పేమి?

భీమ: మా జనని వాక్యములు తథ్యములు.

కృష్ణు: నేనుండ మీకీ వివాదమేల? మాయత్త కుంతి యెన్నఁడును నాడిన మాట తప్పనిది. ఆమె యిష్టము నెరవేఱ్పుము.

ధృష్ట: అసురాంతకా! దేవకీనందనా! సకల నిగమాంతవేద్యుఁడవు నీవును, సకల ధర్మాధర్మవిచక్షణుఁడైన యుధిష్ఠిరుఁడును నిట్లు పల్కుచుండఁ జెప్పెడు వారెవ్వరు?

ద్రుప: నాయనా! ధర్మనందనా! వేగ మేదో చెప్పుము?

ధర్మ: చెప్పుట కేమున్నది? నీకూతును మా యేవురకునిమ్ము వివాహ మాడెదము.

ద్రుప: అట్లుకాదు. అర్జునునకే చేయుట యుక్తము.

ధర్మ: అర్జునుఁడు నాకుఁ గనిష్ఠసోదరుఁడు. అగ్రసోదరుఁడను నేను వివాహము గాకుండ నుండగాఁ దమ్మున కెట్లు పెండ్లిచేయ నగును?

ద్రుప: పోనీ! అట్లయిన నీవే పెండ్లియాడుము.

ధర్మ: రాజా! దేహబలమునఁ గష్టపడి కన్యను సంపాదించిన యర్జునుఁ డుండ నేనెట్లు వివాహ మాడఁగలను?

ద్రుప: అట్లయిన దానికేమి చేయుదము? ఎట్లును గుదురదు.

ధర్మ: ఎట్లును గుదురకేమి? మాకు నేవురకిమ్ము.

కృష్ణ: అట్లుచేసిన యెడల లగ్గు. నాయభిప్రాయము చేయుమనియే.

ద్రుప: ఈ ధర్మ సందేహము కృష్ణద్వైపాయను వలనగాని తీరదు.

ధర్మ: అమ్మహాత్ముఁడు మనతావునకు వచ్చు టెట్లు?

ధౌమ్యు: అదిగో! మహానుభావుడగు వేదవ్యాసుఁడిటు వచ్చుచున్నాఁడు.
(వేదవ్యాసుఁడు ప్రవేశించును. అందఱు నమస్కరింతురు)

వ్యాసు: రాజా! నీవీపటుకును జర్చించుచున్న యంశమెయ్యది? మహాత్మా! మాధవా? సకుటుంబపరివారసమేతముగా నీకు క్షేమమే!

కృష్ణ: శ్రీమన్నారాయణావతారులగు తమ కటాక్షముండ లోపమేమి?

ద్రుప: మహాత్మా! నేను మత్కుమారికా స్వయంవరార్థము మత్స్య యంత్రము నిర్మించితిని, దానిని పాండవ మధ్యముఁడు భేదించె. అందుచే మత్కుమారిక నీయర్జునున కీఁదలంపఁ దమ కేవురకు నీమె నిమ్మని యుధిష్ఠిరుఁడు పల్కుచున్నాఁడు. అదియే వివాదాంశము.

వ్యాసు: అందు వివాదమే మున్నది. దాని యందలి ధర్మమర్మ మెల్ల రకు దెల్లమే. యుధిష్ఠిరవచనప్రకార మందఱకునుఁ బెండ్లి చేయుము.

కృష్ణు: రాజా! యజ్ఞసేన! వేదవ్యాస వచన ప్రకార మాచరింపుము.

ద్రుప: (తనలో) ఈతఁడు గూడ నిట్లే చెప్పుచున్నాఁడు!

ధృష్ట: ఇది ధర్మమే కాకుండిన నితఁ డిట్లేల చెప్పును?

వ్యాసు: రాజా! దీననీవు సందేహింపవలదు. దీనికొక్క యితిహాసము కలదు. తొల్లి యింద్రసేన యను చంద్రానన చంద్రధరు గుఱించి తపమొనర్చి యేవురు భర్తలనుఁ బడయ వరముఁబడసెను. అదియే నీకుమారిక. కాన దీని నేవురకును వివాహముచేయుము.

ద్రుప: అట్లయిన నింకనేమి? నేను గడు నదృష్ట వంతుఁడను.

ద్రౌపది: (తనతో) మదీయేప్సితము సంపూర్తిగా నెఱవేఱినది.

ధృష్ట: చెలియ లొక్కరిత యైనను మఱఁదు లేవురు గల్గిరి. నేన దృష్ట వంతుఁడను.

కృష్ణు: రాజా! ద్రుపదుఁడా! నీయదృష్ట మింతింతయని యనరాదు. నిజమే! నాకును నానందము మెండగుచున్నది. యేలయన, నా

మేనత్తకుమారులైన పాండవులు లాక్షాగృహమునుండి బైటఁ బడుటచేతను. రెండవది స్త్రీ పుత్రికను వివాహమాడుటచేతను.

ద్రుప: చక్రిపాణీ! ముకుందా! నీ యానందము మాకు శ్రేయఃప్రాప్తి గదా!

వ్యాసు: రాజా! ఇఁక నాలస్య మెందుకు? వివాహ మతివేగముఁగా గావింపుము.

ద్రుప: అవును, ఇదిగో! సకలరాజేంద్ర కుమారవర్గ సమక్షమునను, సకల భూసుర సాన్నిధ్యమునను, నిఖిలసురాసురఖేచర సమక్షమునను మత్పుత్రికా రత్నమగునీ కృష్ణను పాండునందనుల కేవ రకును నొసఁగి వివాహము చేయుచున్నాను.

వ్యాసు: శుభమగుఁగాక! ఈవధూవరులకుఁ జిరాయుర్నిరామయము లగు గాక!

కృష్ణు: మదీయాశీర్వచనమున వీరలకు ననంతాభ్యుదయములు గలుగుఁ గాక!

ధౌమ్యు: ఆచంద్రార్కం వంశాభివృద్ధిరస్తు. రాజా! వీరల కేవురకును కుమారిక నప్పగింపుము.

ద్రుప: (విచారముతో) మహాత్మా! అందుకు సిద్ధమై యుంటిని గాని, కరచరణ జిహ్వాద్యవయవములలోఁ జైతన్యము నశించెడును.

వ్యాసు: సమస్తధర్మాధర్మవిశారదుఁడవు నీవు బేలవై యుండుట యుక్తమే?

ద్రుప: అవును. అబ్బాయీ! యుధిష్ఠిర! ఈ నా కుమారిక గడు ముద్ద రాలు. నీవు శాంతమూర్తివేయైనను చెప్పక మానఁజాలను,

తెలియని కార్యములఁగఱపి జాగ్రత్తగా దీని నాదరింపుము. ఇదిగో! పాణిగ్రహణ మాచరింపుము. (అని చేతికి నప్ప గించును)

ధర్మ: రాజా! అమాత్రమే నెఱుగనా?

ద్రుప: అబ్బాయీ! భీమసేన! నీవు మహాగ్రహాయత్త చిత్తుఁడవు—చేతఁగాని యీ బాలయేమిచేసినను సైరింపవలయును సుమీ! (పాణిగ్రహ ణము చేయించును.)

భీమ: మదీయదుర్వారాగ్రహ మహితులపైఁగాని సతులపైఁజూపఁ దగినదికాదు. కులాంగనను లాలించు విధము నాకు తెలియదే?

ద్రుప: వత్సా! అర్జునా! శత్రునకుపకారము చేయుమన్నట్లు తొంటికాల మున నాకు శత్రువై నన్నవమానించి ద్రోణాచార్యుల పాదముల కడ నన్నుఁబడవేసినట్టి నీకుఁబుత్రికను గని యిచ్చినాఁడను. సౌజన్యగుణధాముఁడవు. నీకుఁజెప్పవలసినదిలేదు. దీని పాణిగ్ర హణము చేయుము. నీకొఱకై కాంచిన ధనము, నికర్పించితిని. (పాణిగ్రహణము చేయించును)

అర్జు: మామా! మీరావిషయమై చింతనొందకుఁడు.

ద్రుప: నకులా! అభినవ మన్మథుఁడవగు నీకీకన్య చక్కగాఁదగియున్నది ఎఱుఁగక యేమికార్యములఁజేసినను గోపగింపక నేర్పవలయును. (పాణిగ్రహణము చేయించును)

నకు: మామా! ఈనకులుఁడుకి నిర్హేతుకముగా నాగ్రహించుట యసం భవము, అందును నబలయందేల కలుగును?

ద్రుప: వత్సా! సహదేవ! కుంతీ, మాద్రి, పాండురాజులకు నత్యంత ప్రేమాస్పదుఁడవు నీవు. నాకత్యంత ప్రేమాస్పదురాలీయబల. మీరిరువును నధికస్నేహముననుండి నామనోభీష్టము నేఱవేర్ప వలయును. అదియునుఁగాక బాలుఁడవయ్యు నధ్యాత్మవిద్యా సంపన్నుఁడవు. నీకుఁజెప్పనవసరములేదు. (పాణిగ్రహణము చేయించును)

కృష్ణు: (సంతోషముతో) మహారాజా! ఈదంపతులు పరమస్నేహమున నుందురుగాక! శాశ్వతసౌఖ్యము నొందుదురుగాక!

వ్యాసు: తథాస్తు.

ద్రుప: నాయనా! మాధవా! సకలభూతాంతర్బహిర్మధ్య సంగతుఁడవు. మహానుభావుఁడవు. నీకుఁజెప్పనవసరములేదు.

తే॥ గీ॥ నందనందన యీముగ్ధనెందు నీ సు
భద్రికను మాఱుగాఁజూడవలయు నయ్య
కన్నకూతుఁరుకావునఁ గడుపులోని,
దిట్లుచెప్పితినీ వాగ్రహింపవలదు.

కృష్ణు: రాజా! ఆగ్రహముగూడనా! ఆగ్రహమేల తద్వ్యతిరిక్తమెట్లు కాఁగలదు?

ద్రుప: అమ్మా! కుంతీదేవి! ఇదిగోనీముద్దుల కోడలు (అవియప్పగించి)

తే॥ గీ॥ జననివగుచు నిష్టాన్నభోజనము విడుము
నత్తవై పరిచర్యల నందికొనుచు
కడకునొజ్జవై సంగతుల్ గఱపికొనుచు
దీనినేలుకోవమ్మ! యోదేవి! యింక!

కుంతి: రాజా! నీకింత సంతాపమేల? అది మాధనమైనప్పుడు చెడుగేల చేతుము?

ద్రుప: ఔను. అమ్మా! ద్రౌపదీ! కృష్ణా!

చ॥ పతులఁజూడు నీకుసరిసాటిగ నీర్ష్యను బెంపకమ్మ ; నీ
ధవులొకవేళ యాగ్రహముఁదాల్చిన మాఱెదురాడకమ్మ! యో
పవిమలగాత్రి! నీపతులభావమెఱింగి నటించుచుండి యే
యవసరమందు నాధులకు, నయ్యకు, నమ్మకు, గీర్తిదేవలెన్

అమ్మా? పతుల చిత్తానుసారము వర్తింపుము.

ద్రౌప: అయ్యా! అట్లే చేయుదానను.

ద్రుప: (గద్గదముపట్టుకొని ద్రౌపదితో)

ఆ॥ వె॥ నన్నుఁగన్నతల్లి! నాభాగ్య పుంజమా
నాదుపుణ్యరాశి నాకుమారి!
నాపయిని వలుగక నాధులకడకేఁగు
మరలివత్తు సుతులమాతవగుచు.

ద్రౌప: చిత్తము! దేవా! (తలవంచుకొని విచారము సూచించును)

ద్రుప: యుధిష్ఠిర, భీమార్జున, నకుల, సహదేవులారా! మహాత్మా! నంద నందనా! దేవా! అమ్మా! కుంతీదేవీ!

చ॥ అలఘుచరిత్రులార! వినయాది సమస్త గుణాఢ్యులార! నా
కులమువెలుంగు, నాకుఁగడుఁగూర్చు నమంగుకుమారి నాతపః
ఫలమును, నామనోరధము! నానయనంబుల చందమామ!ము
ద్దులసుత! మీకునెల్లరకుఁ దోయజనేత్రిను నప్పగించెదన్॥

వ్యాసు: అవశ్యము శుభమగుఁగాక। అమ్మా! యాజ్ఞసేని!

సీ॥ శాంతస్వరూపుండు, చననీ యుధిష్ఠిరుఁడే
జ్యేష్ఠభర్తయౌనెలమి నీకు!
వీరావతారుండు భీమసేనుఁడితండె
నీకు రెండవభర్త నీరజాక్షి
అంభోధి గంభీరుఁడర్జునుడీతండె
నీకుమూఁడవభర్త నెలతమిన్న!
మారసన్నిభ సుకుమారుండు నకులుండు:
నీనాల్వభర్తయై నెగడుఁగాక
అధ్యాత్మవేది యీయనఘుండు సహదేవుఁ
డైదవభర్తయౌ నంబుజాక్షి!
మనుజావతారంబుగొనినట్టి మాధవుఁడీతఁడెయన్నయై యెన యునీకు

తే॥ గీ॥ తోడరి యీధౌమ్యుఁడు పురోహితుండుగాఁగ
యతివకుంతీ మహాదేవియత్తగాఁగ
పాండవజ్యేష్ఠు వీరపట్టమహిషివగుచు
నిత్యసౌఖ్యమ్ము నొందుము నీలవేణి!

ధౌమ్యుడు: కం॥ ఒక్కొకభర్తృ గృహంబున
నొక్కొక వత్సరముకాలముండుము వారిన్
బెక్కుగతుల సుఖపెట్టుచు!
నక్కుంతేయులనుగొల్వు మంబుజనేత్రి!

(తెరలో మంగళ వాద్యములు)

మహోన్నిద్ధర ధరణీ నాథాగ్రగణ్యుల్ దళితరిపులు సత్యాత్ములౌ పాండు
పుత్రుల్
వరకంజాతాక్షి కృష్ణన్ బరిణయమయి సద్వంశ విస్తారు
లౌదుర్
ధరసామ్రాజ్యంబు సంప్రాప్తమగుఘనత నిత్యంబు పాలిం
త్రుదానన్
బురువంశోత్తంశులౌచున్ భువినుతులగుదుర్ భూరి కల్యా
ణమూర్తుల్ ॥

వ్యాసు: అమ్మాయీ! నీవివాహమునకు దేవతలువచ్చి వరములిచ్చి పుష్ప
వర్షముఁ గురియించుచున్నారు.

ద్రుప: ఏమీ? నాభాగ్యము!

ధర్మ: దేవతల యాశీర్వచనమున మాకభ్యుదయమగుగాక!

కృష్ణ: సామ్రాజ్యప్రాప్తి గలుగుననిగూడ వరమిచ్చిరి.

కుంతి: దేవతలుకూడ మెచ్చిన వివాహమాడిన యీసుతులకు సామ్రాజ్య
మెప్పుడురాఁగలదో గదా!

(అప్పుడు ఉత్తరము చేతఁబట్టుకొని తొందరతో నొక భటుఁడు
ప్రవేశించుచున్నాఁడు)

భటు: ద్రుపదమహారాజా! మీకొకయుత్తరము ధృతరాష్ట్ర మహారాజు
గారంపిరి. యుధిష్ఠిరమహారాజా! మీజనకులు మీకొకజాబువిచ్చిరి

ద్రుప: ఏదీ? దానిఁజెప్పుమ్మ.

ధర్మ: ఉత్తరమిట్లిమ్ము కురువృద్ధ బాంధవులతోను, బుత్రులతోను,
బూజ్యులైన మాజనకులు ధృతరాష్ట్రమహారాజు కుశలులై
యున్నవారా? అదిచెప్పుము.

భటు: ఆః సేమముగా నున్నారు.

భీము: (తనలో) ఆ జనకునకు నీతనయునకు సరిపోయినది. అట్టి యపకారము చేసిన మహాపాపు సేమ మరయుటయు యుక్తము గాదు.

ద్రుపదుడు: నాయుత్తర మిట్లున్నది. స్వస్తిశ్రీ పాంచాల భూమీశ్వరా:

మ. జలజాతాయితనేత్రి నీతనయఁ గృష్ణన్ పాండు రాజేంద్రపు
త్రులకుం బెండిలిజేయ నామదిని సంతోషంబు మెండయ్యెదుః
బలిమిన్ గూడెను భారతాన్వయము నీపాంచాలవంశంబు భూ
స్థలిన్నేఁ బంచెద! పంపు పాండవుల నింద్రప్రస్థ మందేలఁగన్.

ధర్మ: నాయుత్తర మందిట్లున్నది. "చిరంజీవి యుధిష్ఠిరునకు నాంబి కేయుఁ డాశీర్వచన పురస్సరముగ వ్రాయున దేమన

చ. కొడుకులలోన జ్యేష్ఠుఁడవు కుంతికె గా దిలనాకుఁగూడ, తా
దుడుకుదనాన మత్సుతుఁడు దొడ్డయొఱుంగక చేసెఁదప్పు, నీ
వెడనదియుంచి క్రోధమును వించుక పెంపకు నన్నుఁజూచి, నే
నిడియెద సర్వరాజ్యమును, స్వబు విశాల విభూతి రమ్మిఁకన్.

భీము: మనమా లాక్షాగృహమునఁ బ్రదికితిమని విని యేదియైనఁ దన కపకారము గావింతుమని యిట్లు భయపడి వ్రాసెను.

కృష్ణుడు: దేవతల యాశీర్వచనము స్పష్టమై రాజ్యప్రాప్తి గల్గినది.

వ్యాస: అందును నీకటాక్షముండఁగా నింక లోపమేమి?

ద్రుప: ఇంకనే నన్నిభంగుల ధన్యుఁడనైతిని. మహారాజులు నాకల్లుండ్రైరి. ఇఁకనేమి?

ధృష్ట: మావంత లన్నియు నింకఁదీరినవి. అంతయు నింకసంతోషమే!

ధౌమ్య: యుధిష్ఠిర మహారాజా! అభ్యుదయములు చేకూరుఁగాక!

కుంతి: ఆహాహా! నాకుమారునకు మహారాజాభిదానము గల్గినది. నాభాగ్య మెవ్వరికినిరాదు.

ధర్మ: దేవకీ నందనా? నాకింక నొక్క లోపము గలదు

కృషుడు: అది యేదియో వేగమెఱిఁగింపుము.

ధర్మ: నీవర మొక్కటియే!

కృష: ఇంతియేకదా: డానిఁగోరుము!

ధర్మ:

మాలిని: శ్రీనిలయుండయి నాగృహ మెన్నఁడు చెన్నలరారుచు
నుండవలె॥

మానవ నాధుఁడు భూప్రజ సేమమె మానక చూచుచు న్నేలవలెన్
దానవనాశక! యీమహియందున ధర్మము నిత్యము చెల్లవలెన్
శ్రీనళినాయతలోచన! నీవయి చిత్తమునెప్పుడు నిల్పవలెన్.

కృష్ణ: తథాస్తు! (అందఱు నిష్క్రమించుచున్నారు)

స మా ప్త ము.